## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015951

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శుకసప్తతికథలు

గ్రంథకర్త్రి:

శ్రీమతి జొన్నలగడ్డ కామేశ్వరిదేవి.



ప్రకాశకులు:
పి. రంగారావు,
శ్రీసత్యానంద బుక్ డిపో,
రాజమండ్రి.
1940

 [వెల 0—12—0.

# భూమిక.

—:o:—

ఆంధ్రమున నీ "శుకసప్తతి" కథలు వ్రాయవలెనను సంకల్పము చాలకాలమునుండి కలదు. ఒకటి రెండు పురాతనగ్రంథములం జదివి, యవి చాల నసందర్భముగ నుండుటచే, నీ విధముగా వ్రాసి, ఆంధ్రభాషావధూటి కొక నూత్నాలంకారము సమర్పించినాను. గుణగ్రహణపారీణులగు చదువరు లిందలి దోషములను మన్నింపం బ్రార్థితులు.

మదరాసు,
22_9_39.

ఇట్లు,
గ్రంథకర్త.

# విషయసూచిక.

—:o:—

ఓం.

శ్రీరామాయ నమః.

అవిఘ్నమస్తు.

# శుకసప్తతికథలు



## 1. వేఁటగాని యుదంతము.

———:o:———

తొల్లి వింధ్యారణ్యభూముల నొక వ్యాధుఁడు నివసించుచుండెను. ఆ బోయవాఁడు మృగయయే తన జీవితవృత్తిగాఁగొని వేఁటలో లభించిన పక్షులను నగరమునకుఁ గొంపోయి, వాని నమ్మి జీవింపుచుండెను. ఒకనాఁటి సాయంసమయమున నా కిరాతుఁ డరణ్యమునకుఁ బోయి, యున్నతమగు నొకమహీరుహముపై నున్న కీరములగుంపును గని యమందానంద భరితాత్ముఁడై "ఆహా! ఏమి నా యదృష్టము? ఈ చిలుకలన్నియు నాకు లభించెనా వారముదినములకు సరిపడు నాహారమునకుఁ గొదువ యుండదు. రేపటిదిన మియ్యెడ కరుదెంచి, యురులఁ బన్నిపోయినా, సాయంకాలము తిరిగివచ్చి యీ శుకములన్నియు వలలో నగుల్కొనఁగలవు." అని తలపోసి వెడలిపోయెను.

మఱుచటిదిన ముదయమున నా కిరాతుఁ డరుదెంచి, వలనుబన్ని వెడలిపోయెను. ఆహారమునకై యరిగి, యహస్కరుఁడు పశ్చిమశైలమున కేగినపిదప తమ కులాయములకుఁ దిరిగివచ్చిన చిలుకలన్నియు

వలలోఁ జిక్కుకొని, "అయ్యో! అన్యాయముగ నీ యురులయం దుఁ జిక్కుకొని భంగపడితిమే. ఏమి చేయుదము? నేఁటితో మనమెల్లరము నసువులఁ బాయుతరుణము సంప్రాప్తించెఁగదా!" యని తమలో దాము వాపోవఁ దొడఁగినవి. అప్పుడు ఆ కీరములలోఁ బెద్దది తక్కుం గలవానిం జూచి "మిత్రులారా! వగచినఁ బ్రయోజనమేమి కలదు? మనము కర్తవ్యము నూహింపకున్నచో, వేఁటగాఁడు తిరిగివచ్చి, మనల బంధించును. ఆపదలందే ధైర్యము వహించుట ధీరలక్షణము. నా కొక యుపాయము తోఁచినది. వ్యాధుఁడు వచ్చునప్పటికి మనమెల్లరము ప్రాణములు పోయినట్లు చేష్టలుడిగి పడియుండము. అట్లు చేయుటవలన నిర్జీవశుకములు మనకేలనని యా కిరాతుఁడు మనల విడిచిపోఁగలడు. వలనుండి యొక్కొక్క కీరమునే యతఁడు క్రిందఁ బడవేయునపుడు మెలకువగలిగి లెక్కపెట్టికొనుడు. నూఱు చిలుకలు పడినంతనే మన మొక్కసారిగా తుఱ్ఱుమని యెగిరిపోదము." అనెను.

చిలుకలన్నియు నా యుపాయమునకు కడుంగడు ముదమంది యట్లే చేయుదమనినవి. వేఁటగాఁడు మఱుసటిదిన ముదయమున వచ్చి చూచుసరికా కీరములన్నియు చేష్టలుదక్కి, తలలు వ్రేలవైచుకొని పడియుండెను. "అయ్యో! అన్ని చిలుకలు నొకేసారి మృతినొందిన విదేమి చిత్రము? ఇంతకును నేను దురదృష్టవంతుఁడనుగానున్న నిట్టి విపరీతము ఘటిల్లునా?" యని యా కిరాతుఁడు తలపోసి, యొక్కొక్కచిలుకనే యురులనుండి తొలఁగించి, క్రిందఁ బడవేయుచుండెను. తొంబదితొమ్మిది చిలుకలట్లు పడిపోయినంతనే, కిరాతుని మొలనున్న పటకానుండి కత్తిజారి క్రిందఁబడెను. ఆ యలుకుడు నాలకించి, శుకములు నూఱును క్రిందఁ బడినవనుకొని, తుఱ్ఱుమని యెగిరిపోయినవి. బోయవాఁడు నిశ్చేష్టుఁడై "ఆహా! ఎంత మోసము. పక్షులచే తుదకు వంచింపఁబడితినే?" యని వలలో మిగిలియున్న యొక్కచిలుకను నేసి,

కోపాతిరేకమున కంఠము నులిమిచంపఁబోవ నయ్యది మానవసహజకంఠ స్వరమున, నతని కబ్బురమొదవునట్లు యిట్లనియెను—

"ఓ వ్యాధుఁడా! నీ కాశాభంగమైనది. పక్షులన్నియు నెగిరి పోయినపుడు చూచుచు నూరకుండి, తుదకు మిగిలిన నన్నొక్కదానిం గసిచే చంపఁబూనుట న్యాయమగునా? నీవు విచారింపక నన్ను పట్టణములోనికిఁ గొంపోయి వేయివరహాలకు విక్రయింపఁ జూపుము. భాగ్యశాలియైన వణిజుఁ డెవఁడైనా కొనెనా, నీ దారిద్ర్యము తొలఁగి పోవును."

చిలుక యవ్విధమున మనుష్యునింబోలె విచిత్రముగ సంభాషించుటచే, నాశ్చర్యాన్వితస్వాంతుఁడైన కిరాతుఁడు మాఱుమాటాడక, యా కీరమును నగరములోనికిఁ గొంపోయి ధనికులైన వర్తకుల కమ్మఁజూపెను. వేయివరహాల ధర చాలహెచ్చుగనున్నదని పెక్కుమంది తలపోసిరి. ఆ బోయవాఁ డట్లు తిరుగుచు, పురములో భాగ్యశాలియైన రత్నసాగరుఁ డను బేహారి భవనమునకుఁబోయి చూపెను. మాటలాడు నా శుకమునుగాంచి, రత్నసాగరుఁడు నిర్భరానందవివశుఁడై, యా చిలుక నెట్లయినఁ గొననెంచి, బేరమాడెను. బోయవాఁడు వేయి వరాలకుఁ దక్కువకు విక్రయించనని నిష్కర్షగా చెప్పుటచే, చిలుక సంశయించుచున్న యా వణిక్శ్రేష్ఠునిఁగాంచి, "ఓయీ! బేహారీ! సంశయమువీడి, యితఁడు కోరిన ధనమిచ్చి కొనుము. నీకే నెంతయు మేలొనఁగూర్తును." అని వాక్రుచ్చెను. వర్తకుఁడు ప్రమోదమంది యా వ్యాధునకు ధనమిచ్చి పంపివైచెను. రత్నసాగరుఁ డా శుకము నల్లారుముద్దుగఁ బెంచుకొనసాగెను. అయ్యది బేరగాండ్రకు స్వాగత మొసఁగుచు, తానే వెలలఁజెప్పుచు, క్రయవిక్రయముల సాగించుచుండెను. మాటలాడు నా చిలుకను జూచుటకై యనేకులు తండోప

తండములుగ వచ్చుచుండుటచే రత్నసాగరుని వ్యాపారము సహస్ర ద్విగుణితమాయెను. ఇంతియే గాక, యా చిలుక తగవులందీర్చుట, వినోదములఁ జెప్పుట మున్నగునవి చేయుచు, నెల్లరకు మిక్కిలి సంతసముఁ గూర్చుచుండెను. రత్నసాగరుని భార్య పద్మినియు నా శుకమునెడ మిక్కిలి మక్కువ గలిగియుండెను.

## 2 రాజు పద్మినిం జూచుట.

రత్నసాగరుఁడు నివసించు నగరము సువర్ణపురమునాఁ బరఁగును. ఆ నగరమును మన్మథసింహుఁ డను రాజు పరిపాలించుచుండెను. అతఁడు సౌందర్యవంతుఁడై సార్థకనాముఁడో యన నొప్పుచుండెను. ఆతఁ డొకనాఁటి మధ్యాహ్నంబున మృగయావినోదార్థమై యరణ్యమునకుఁ జని, సాయంసమయమునఁ దిరిగివచ్చుచుండెను. రత్నసాగరుని సతి పద్మిని. ఆమె జగన్మోహనకరసౌందర్యవిలాస విభ్రాజితయై, యనన్యసామాన్య లావణ్య విరాజితయై, యపరరతీదేవియన విలసిల్లుచుండెను. సౌధముపై యంతస్తున నిలువఁబడి యా యన్నులమిన్న వీథి వైపు చూచుచుండెను. హయారూఢుఁడై యా మార్గమున నేతెంచుచున్న రాజు పద్మినిం గాంచెను. పద్మినియు రాజు నా క్షణముననే చూచెను. ఇరువురిదృష్టులు నైక్యమయ్యెను. ఆ మందయానవదనకమలసుధను తనలోచనాంజలితోఁ గ్రోలుచు మన్మథసింహుఁ డట్లే నిలువఁబడిపోయెను. రూపజితమన్మథుఁడైన మన్మథసింహుంగాంచి, ప్రణయపాశబద్ధయై యామె వెనుకకు బోలేకపోయెను. ఆమెకుఁ బాదములు

తడబడెను. ఎవరైనఁ జూచెదరేమోయను భీతిపెంపున పద్మిని లోనికిఁ బోయెను. రాజును కోటలోనికిఁ బోయెను. అసాధారణసౌందర్యవతి యగు పద్మిని, రత్నసాగరుని భార్యయనిరాజు తెలిసికొనెను. హృదయము మరల్చుకొనఁ బ్రయత్నించెనుగాని యది సాధ్యము కాదయ్యెను. ఎవరితోడను సంభాషింపక విచారగ్రస్తుఁడై యుంటచే, సంతఃపురమున నల్లకల్లోలముగ నుండెను. రాజునకు కడునిష్టురాలై వర్తించు పరిచారిక మంజరి కారణమరయఁ బ్రయత్నించెను. రాజు తన హృదయము నాహరించిన యున్నులమిన్న నెట్లయినఁ గూర్చుమని యడిగెను. మంజరి "ప్రభూ! దానికై యింత విరాళియేల? చేపేపోయి నా చాతుర్యము మెరయ నామెను గొనివచ్చి, మీ పాదాక్రాంతురాలిని జేయనా? విచారము మానియుండు" డని ధైర్యము, గొలిపి, మఱుచటి యుదయమున రత్నసాగరుని సౌధమునకుఁబోయి, పద్మినితో సంభాషించెను.

విరహానలసంతప్తయైయున్న పద్మిని "మంజరీ! నేనేమి చేయుదాన? ఆనాఁ డేముహూర్తమున నా దివ్యతేజోమూర్తి నుపలక్షించితినో, నాటినుండి కంటికి కునుకే లేదు. ఏమి చేయుదమన్నను తోఁచదు. అహర్నిశములు నా హృదయాంబరమున నా మనోహరాంగుని స్వరూపమే సాక్షాత్కరించుచున్నది. నా నాథుఁ డొక్కఁడున్నామెన నన్నెడబాయడుగదా! చతురవగు నీవే యేదైన నుపాయ మూహింపు" మనెను.

ఆమె మదనశరపీడితుఁడై పోగులు నృపుని చెంతకరిగి "రాజేంద్రా! నా కేమి బహుమానమిచ్చెదరు? సంతోషకరమైన సమాచారము నెఱిఁగింతు" ననెను. రాజు వజ్రహారమిచ్చెను. ఆమె పద్మిని యాడిన మాటలఁ దెలిపెను. మఱునాఁటి యుదయమున మన్మథసింహుఁడు రత్నసాగరునిఁ బిలిపించి "మిత్రమా! నీవు నేఁడు నవద్వీపమునకుఁ

బోయి, యటనుండి కొన్నిమరకతములఁ గొనిరావలయును. నా సఖికి చాలకాలమునుండి వానిపై మక్కువఁగలదు. దీనికి తగినవాఁడవు నీవు గాక తదన్యు లెవరుగలరు? ఓడపైఁ బోయిరమ్ము." అని కొంత ధనమిచ్చెను. ఆ సైకము నొని, నిజనిలయమునకుఁ బోయి, భార్యతో రాజకార్యము నెఱిఁగించి, జాగ్రతగ నుండుమని యామెతోను, శుకముతోను జెప్పి, వేకువఝామునవే వెడలిపోయెను.

పద్మిని తన మనోవాంఛితము నెఱవేఱు మహావకాశము లభించెగదాయని యానందభరితహృదయయై యుండెను. మంజరి వచ్చినంతనే యామెచిత్త మానందాతిరేకమున నుప్పొంగెను. ఆమెను కూర్చుండజేసి, తనయందు రాజునకు నిజముగా వలపు జనించెనా యని యడుగ మంజరి చతురవాక్కులచే నున్నది రెండింతలుచేసి చెప్పసాగెను. ఆ నాటిరాత్రి తప్పక రాజును గూడుటకై వచ్చెదనని పద్మిని వాగ్దానమొనరించెను. అహస్కరు, డెపుడు పశ్చిమాంబుధి మునుంగునాయని మన్మథసిఁహుఁడును, పద్మినియుఁగూడ నాత్రము నందియుండిరి. ఘడియ యొక యుగముగతోఁచెను. సూర్యుఁ డస్తమించెను. సంజకెంజాయచే గగనము నిండిపోయెను. కొంతతడవునకు జగము సాంద్రతమోమయమైనది.

పద్మిని పన్నీటజలకమాడి, పట్టుచీర ధరించి, సర్వాభరణభూషితయై, యభిసారికవోలె ప్రియునిఁ గూడుటకు బయలుదేఱెను. గాని పంజరబద్ధమైన శుకము "అక్కా! పద్మినీ! రాజుకడకా పోయెదవు? నృపాలురు చపలాత్ములు వారి యక్కఱతీరినపిదప మన ముఖమునైనఁ జూడరు. అయినను నీ జారత్వము మహాపాతకము. పాపమని వెఱువనందువా? చాతుర్యముండవలెను. చమత్కారము నెఱుఁగవలెను. రంకునేర్చినది బొంకునేర్చెనన్న ట్లసత్యములాడి, యాపత్సమయముల

కడుజాగరూకతతో మెలఁగవలయును ? నీకు వ్యభిచారము చేయుతలంపేకలుగునెడల గడుసుఁదన మలవఱచుకొనవలెను అట్టి చాకచక్యము లేనిచో విపత్తులు ఘటిల్లును. పండువంటి కాపురము పాడగును. వ్యభిచారమున కౌశలముగలవారి నెందఱినో నే నెఱుఁగుదును. నేఁడు నీకు నళినాక్షికథ చెప్పెద నాలకించి, పిదపపొమ్ము." అనెను.

చిలుక తానును మంజరియు సంభాషించుకొన్నపు డంతయువిని యుండవచ్చునని యెంచి, యాశ్చర్యాన్వితస్వాంతయై, నళినాక్షికథను విన నభిలషించెను.

## 3 నళినాక్షికథ.

—:o:—

"అక్కా ! వినుము. పూర్వము జయంతపురమున వర్థమానుం డను వీరుఁడు కలఁడు. ఆతనికి నళినాక్షియను భార్య కలదు. ఆమె చక్కనిచుక్క. భర్త యింటలేనితఱి యొకనాటి సాయంసమయమున నా యిందువదన మనోహరముగ నలంకరించుకొని, వీధిగుమ్మములో నిలుచునియుండెను. వారి యింటికి సమీపముననే అనంగశర్మయను బ్రాహ్మణ యువకుఁడు నివసించుచుండెను. ఆ మార్గమునఁ బోవునపు డెల్ల యతఁడు నళినాక్షినిఁ జూచుచు నామెయెడ మరులుగొనియుండెను ఒకనాఁటి సాయంసమయమున వర్థమానుఁ డింటలేడని గ్రహించి దాహముగనున్నది. కొంచెము మంచినీ రిచ్చెదరాయని నళినాక్షి నడిగెను. అతఁ డనుదినంబును తనవంక మోహావిలములగు దృక్కులఁ బ్రసరించుచున్నాఁడని యదివఱకే గ్రహించియున్న యా కోమలి దరహా

సితె వదనారవిందయై, సువర్ణకలశము నిండుగ జలముంబోసి యిచ్చినది. అతఁ డెవ్వరునులేని యీ యదనుఁగని "కామినీ! నేనేమని చెప్పు దును. నాకుఁగలతృష్ణ ప్రణయతృష్ణగాని వేఱొండుకాదు. నాయెడల నీకుఁ గటాక్షము కలదేని, మదనక్రీడల నన్నానందింపఁజేసి, ధన్యుని గావింపు" మనెను.

అతని తెగువ కాశ్చర్యపడి నళినాక్షి "విప్రకుమారా! ఎవ్వరు నింటలేనితఱి, దాహమునకనివచ్చి యిట్లాడుట తగునా? నా భర్త కిది తెలిసినచో మనల నిర్వురను బ్రతుకనిచ్చునా? నిన్నుఁ జూచిన జాలిపొడముచున్నది. నా వీలును జూచికొని, నేనే మీ గృహంబున కేగుదెంచి, నిన్ను ప్రణయవారాశి నోలలాడింతు" నని చెప్పెను. భూసురకుమారుఁడైన యనంగశర్మ నిర్భరానందవివశుఁడై యింటికిఁ బోయెను.

వర్ధమానుఁడు మహావీరుఁడు అతఁడు ప్రతిశనివారము నభ్యంగనస్నాన మాచరించుట యలవాటు. అలాగుననే నేకుపర్యాయమున స్నానము చేయుచుండగా, నళినాక్షి కుంకుడుకాయపులుసుతో శిరస్సునకు దట్టముగాఁ బట్టించి, సలసలక్రాగియున్న జలమును బోసెను. "అయ్యో! ఇంతవేడి భరించలేను. శీతలజలమునుకూడ కలిపి, సమోష్ణజలముఁ బోయు" మని యతఁడు పలుక "నింట నొక్కనీటిచుక్కయు నలేదు. బావికిఁబోయి గొనివత్తునుండు" డని ఘటమును, చేదయుఁ దీసికొని త్వరితగతి ననంగశర్మ యింటికిఁబోయి, నిద్రాముద్రితుఁడై యున్న వానిని మేల్కొలిపి "ప్రియుఁడా! వచ్చితినా లేదా?" యనెను. అతఁడు నిరతిశయానందభరితాంతఃకరణుఁడై యామె నింటిలోనికిఁ గొంపోయి, మదనకదన మొనరించి, సంతృప్తుఁడాయెను. అపుడామె ప్రియుని బావికడకుఁ గొంపోయి, త్రాడును బట్టుకొనుమని

చెప్పి తాను మెల్లగా నూతిలోదిగి, యొక దిగుడుమెట్టుపై నిలిచియుండెను. బావికిపోయి యెంతసేపటికిని రాకుండుటచే కోపోద్రిక్తుడై వర్ధమానుఁ "డింతసేపేమి చేయుచున్నాదో. రానిమ్ము. చితుకఁగొట్టెద" నని తలంచుచు, వేడి చల్లబడుటచే నా జలమును స్నానముచేసి, యామె రాకకై వేచియుండెను. ఆమె రాలేదు గాని యొకయువతి వచ్చి, "అన్నా! నీ భార్య నూతిలోఁ బడిపోయిన" దని చెప్పుసరికి, హృదయమాందోళనాయత్తముకాగా, బావికడకుఁ బరుగెత్తెను.

అప్పటికే పెక్కుమంది బావిచెంత నుండిరి. త్రాటినిచ్చెన లోనికి దింపిరి. ఆమె యా నిచ్చెన సహాయమునఁ బైకి వచ్చినది. భర్త నుచూసి బోరుమని ఏడ్చినది. ఆమె నూఱడించి, వర్ధమానుఁ డింటికి గొనిపోయినాడు. నీరు తోడుచుండగా త్రాటి కందనందున మఱికొంచెము వంగితిననియు, కాలుజారి నూతిలోఁ బడిపోయినాననియు నళినాక్షి చెప్పఁగా, నదియెల్ల సత్యమని విశ్వసించి వర్ధమానుఁ డామె నోదార్చెను.

"పద్మినీ! ఇట్టి చాతుర్యము నీకుఁ గలదేని, రాజుతో జారత్వమునెఱపఁ బొమ్ము" అని చిలుక చెప్పుసరి కర్ధరాత్రము మీఱుటచే, మఱునటిదినమునఁ బోవచ్చునని పద్మిని, శయ్యపై మేను వాల్చెను.

# 4 మందారవల్లిక

మఱుచటిదినము సాయంసమయమున పద్మిని యత్యంతమనోహరముగ నలంకరించుకొని, భోజన మొనరించి, తాంబూలచర్వణము గావించి, మన్మథసింహుని యంతఃపురమునకుఁ బోనెంచియుండగా "అక్కా! నీకుఁ దగిన చతురతలేదు. వ్యభిచారమున జతురయై బాంకగలిగిన మందారవల్లికథ విని, యనంతరము పొ" మ్మని యిట్లు చెప్పెను.

తొల్లి విశాలాక్షీపురంబున విష్ణుశర్మయను భూసురోత్తముఁడు సుశీలయను భార్యతో నివసించుచుండెను. వారికి మందారవల్లియను కొమరిత కలదు. ఆమె వివాహోచితవయస్కయైయుండ, తలిదండ్రులు సుశర్మయను తమ బంధుకోటిలోని యువకునకు వివాహము గావించిరి. ఇరువురును కాపురము చేయుచుండిరి. కొంతకాలము గడచినది. వారి బంధుగులయింట వివాహమునకు రమ్మని యాహ్వానము వచ్చినది. ఆ దంపతు లా పెండ్లికి వెళ్ళినారు. బంధువులతో నా పెండ్లివా రిచ్చిన బస కిటకిట లాడిపోవుచున్నది. సుశర్మకు భార్యను గూడవలయునను నభిలాషజనించినది. అతఁ డందుచే నామె స్నానార్థమై కాలువకుఁ బోయినపుడు తానుకూడ నేగి, తన కోరికను దెలిపెను—

"అయ్యో! మనకు జమ పెందులకు? రాత్రి నే నందఱిమధ్య శయనించియుందునుగదా! నా పాదములకు దగ్గరగా దీపము నొక ముక్కాలుపీటపై నుంచియుందును. ఆ గుర్తును గమనించి, దీపము నార్పివైచి, క్రీడించి పొందు" అని మందారవల్లి చెప్పెను. అచ్చటనేయున్న వేపచెట్టునెక్కి పుల్లల విరుచుకొనుచున్న బ్రహ్మచారి

యొక్క డీ సంభాషణ నాలకించెను. మందారవల్లి నవయౌవనోజ్వలతను వీక్షనము గాంచినంతనే, యా బ్రహ్మచారి చిత్తమున కామము రేకెత్తినది. పెండ్లివారింట భోజనముచేసి, యా బ్రహ్మచారి పెందలకడనే విడిదిగృహమున కరిగెను. కొంతసేపటికి స్త్రీలందఱును వచ్చి, చావడిలో శయనించిరి. బ్రహ్మచారి యట నందఱును నిద్రాముద్రితలైనారని గ్రహించి, లేచి, దీపమునకు దిన్నగా పండుకొనియున్న మందారవల్లిని గుర్తించి, దీపమార్పివైచి, యామెతో రతిక్రీడల నెఱపి, ముక్కాలిపీటను ప్రక్కగా జరిపి వెడలిపోయెను.

ఇంతలో చంటిపిల్ల వాడేడ్వ, నొకయిల్లాలు లేచి, దీపమును మఱల వెలిగించెను. మఱికొంతసేపటికి సుశర్మవచ్చి, దీపమున్నతావు గుర్తించి, యార్పివైచి, యచటనున్న కాంతిపై బడెను. ఆమె దొంగ దొంగయని యఱచెను. అందఱును లేచి, దీపము, దీపము దొంగదొంగ యనిరి. సుశర్మ పాఱిపోయెను. దీపము వెలిగింపబడినపిదప సద్దణగి, యందఱును తలుపుల బంధించుకొని నిశ్చింతగా నిద్రించిరి. మఱుచటి దిన మొదయమున సుశర్మ భార్యనుజూచి యిట్లేనా చేయుట ? యనెను. ఆమె యాశ్చర్యపడి, తనతో రాత్రి క్రీడించినది భర్త కాదని గ్రహించి, ముఖముపై వెల్లదనము ప్రకటితముగాకుండ నవ్వుచు "చాలెండు. నేనేమి చేయుదును. దీపము నట్లేయుంచి శయనింప, నది గాలి కారిపోయినది. ఆమె యెవరో కిటికీకి ప్రక్కగాదీసి, వెలిగించినది. అది మీరు చూచుకొనకుండ పొరపడి "దొంగదొంగ" యని పించుకొన్నా" రని బొంకెను.

"అట్టి నేర్పు నీకున్నయెడల తప్పక వ్యభిచరింపవచ్చు" నని కీరము పలికినంతనే వేళ మీఱుటచే, నింకేమి వెళ్ళనని, పద్మిని హంస తూలికాతల్పముపై శయనించి, నిద్రించెను.

# 5 మదనమోహినికథ.

—:0:—

"అక్కా! నేను చెప్పునట్టి యీ కథ నాకర్ణించిన యనంతరము నీవు నేడు రాజుకడ కేగుదువుగాని" యని పలికి, శుక మివ్విధమునఁ జెప్పసాగెను.

మున్ను హేలావతీపురంబున పరశురామశాస్త్రియను భూసురోత్తముఁడు కలఁడు. అతని భార్య గుణవతి సకలసద్గుణసంశోభితయై చెన్నొందుచుండెను. ఆ దంపతులు సంతానహీనులై, యెన్నో దానధర్మముల చేసిరి. వ్రతముల నాచరించిరి. గాని లాభము లేకపోయెను. గుణవతి "నాథా! నా కేమియుఁ గష్టముండదు. మీరు మఱల నింకొక బాలికను వివాహము చేసికొనుడు. 'అపుత్రస్యగతిర్నాస్తి' యను సూక్తి విద్వాంసులగు మీకుఁ దెలియదే? నే చెప్ప వలయునా" యని తానే యొక సంబంధమును కుదిర్చి, పెండ్లి చేసెను యిరువురు భార్యలకు రెండు యిళ్ళ నేర్పాటుచేసి, పరశురామశాస్త్రి కాపురము సేయుచుండెను. అదృష్టవశమున నాతని ద్వితీయకళత్రమగు సుందరి గర్భవతియై, నవమాసములు గడచినపిదప నొకకుమారుని గాంచెను. పుత్రుని ముద్దుమురిపెములఁగాంచి, శాస్త్రి యపారప్రమోదము నందుచుండెను. కొలదిమాసము లిట్లు గడచెను. సుందరి నవయౌవనవతియగుట, పుత్రుఁడు జన్మించినను బరపురుషాసక్తి కలిగియుండెను. పొరుగింటి బ్రాహ్మణయువకుఁడు సుందరియం దధికానురాగయుక్తుఁడై, సమయమును నిరీక్షించుచుండెను. ఒకనాఁడు అతఁడు శాస్త్రి యింట లేనితఱిని సుందరిని గలిసికొని తనకోరిక నెరవేర్చుమని యడిగెను. ఆమె మాఱుమాటాడలేకపోయెను. అతనితోఁగూడి యను దినము సుఖసాగరతరంగముల నోలలాడుచుండెను.

ఒకనాటి వేకువఝామున నా ద్విజకుమారునకుఁ గామోద్రే కముకలిగి, సుందరియింటికిఁ బోయి భర్తకు వినిపించునట్లు "ఒకసారి యగ్గిపెట్టె నిచ్చెదరా ? దీపమారిపోయిన" దని యడిగెను. ఆమె తలుపులఁదెఱచి యగ్గిపెట్టె నీయఁబోవ నతఁడు తా నందులకు రాలేదని తన మనోగతము నెఱిఁగించెను. ఆమె లోనికివచ్చి, తనశయ్యపై నాతనిం బరుండమని చెప్పి, భర్తతో నిట్టులనెను—

" ప్రాణేశ్వరా ! పొరుగింటిబాలున కగ్గిపెట్టె నిచ్చుటకుఁబోగా శునకము ముట్టుకొనినది. స్నానము చేయవలెను. మీరు దూరముగా శయనించుఁ" డనెను. కుమారుని కొంచెమెడముగానుంచి, యా బాలకుని గజ్జెలను ప్రియునకుఁగట్టి, రతిసౌఖ్యాంబుధి నతని నోలలాడించెను. గజ్జెల చప్పుడువిని "అదేమే ! నా నాయన—నా నోములపంట లేచి నాడా ?" యనిపరశురామశాస్త్రి ప్రశ్నించెను. "అవును. అబ్బాయి గంతులు వేయుచున్నా" డని యామె సమాధానమీయ, భక్తిపరుఁడైన యా శాస్త్రి భజనకీర్తనలఁ బాడసాగినాఁడు. విప్రనందనుఁడు తనకు తృప్తికలిగినపిదప, వెడలిపోయినాఁడు. ఆమెవలె నీవు బొంకగలిగినయెడల తప్పక జారత్వము నెఱపవచ్చును. లేకున్న మాట్లాడక, శయ్యాగారమునఁజేరి నిద్రించవచ్చు" ననెను.

వేళ మీఱుటచే నా నాఁడుకూడ రాజన కాశాభంగము కలిగించినానేయని చింతింపుచు పద్మిని నిద్రించెను.

# 6 హేమలతా స్నేహలతల కథ.

-:0:-

"అక్కా! జారత్వ మపాయమునకు హేతువని చెప్పినను నీ పంతమును వీడక మఱల జరీచీరను ధరించి, యపరరతీదేవివోలె నలంకరించుకొని బయలుదేరితివా? నీకు చాకచక్యములేదని నేను ముందే చెప్పితినిగదా! అట్లయిన నీ యిష్టము. నేను నేడిరువురు నవతులకథ చెప్పెద ముందుగ నాలకించు" మని, చిలుక యీరీతిగా చెప్పఁ దొడంగెను.—

పూర్వము వేమారెడ్డిపల్లెలో పాంచాలయ్యయను శూద్రకుల జుఁడు కలఁడు. అతఁడు ధనమదాంధుఁడగుటచే హేమలతా స్నేహాలతలను నిర్వురిని వివాహముఁ జేసికొనెను. వారొకనాఁడు కాలువకుఁ బోయి, ఘటములతో జలముఁగొని వచ్చుచుండగా, నొక బ్రాహ్మణ యువకుఁడు కాన్పించెను. అతనింజూచి, మక్కువగలవారై యా కామినులు "బ్రాహ్మణోత్తమా! మా గృహమునకు రమ్ము. నీకు స్వయంపాక మిచ్చెదము." అనిరి. వారు అట్లు పలికినంతనే "మాకు స్వయంపాకముతోఁ గడుపునిండునా కాలునిండునా?" యని యాతఁడు బదులు పలికెను.

"దక్షిణకూడ యిచ్చెదమయ్యా!" యని వారు మఱల

"నా కదియేల? మిమ్ము చూచుటతోనే నా కడుపు నిండిన దని యా ద్విజకుమారుఁడు వాక్రుచ్చెను.—

ఆతని యంతరంగముననున్న యభిప్రాయమును గ్రహించి, యా యెలనాగులు "అట్లయిన సరే! ర" మ్మని యాతనిని దమయింటికిఁ గొంపోయి, ఫలముల నారగింపజేసి, త్రాగుట కమృతోపతుల్యమైన దుగ్ధము నొసంగి, యతనితోఁ గామకేళిం దేలియాడిరి. వారి భర్త యనాగరికుఁడగు మూర్ఖుఁడగుటచే నేమియుఁ దెలిసికొననేరఁడయ్యెను. అయ్యిరువురు కాంతలు నతనింగూడి యమందానందవారాశి వీచికలఁ దేలుచుండిరి. ఒకనాఁటి మధ్యాహ్నమున స్నేహలత యాభూసురకుమారునితోఁ గ్రీడించుచుండగా, పొలమునుండి యొక యుసిరికొమ్మను దీసుకొని, వారి భర్త యరుదెంచెను. మొదటి భార్యయైన హేమలత భర్తరాకను గాంచి, స్నేహలతతోఁ జెప్పెను.

పతి లోపల నడుగిడకనే, చిన్నభార్య తలవిరయబోసికొని రయ్ రయ్యని వచ్చి "ఓసీ! నేనా యుసిరిచెట్టుమీదనుండు భూతమునని తెలియదా? నన్నెందులకుఁ గొనివచ్చితివిరా? చూడుము. నిన్ను నాశనము చేయుదు" నని పలుక, యాతఁడు "అమ్మా! క్షమింపుము. కర్తవ్యము నుపదేశింపు" మన, "ఈ కొమ్మ నెటనుండి గొనివచ్చినావో యచటనుంచి రమ్ము" అనెను. అతఁడట్లే యని తిరిగి యాయొండలో పొలమునకుఁ బోయెను. బ్రాహ్మణయువకునకుఁ గొంతధనమిచ్చి యా రమణీమణులు పంపివైచి, యాసన్నమైన విపత్తునుండి తప్పించుకొనిరి.

"ఇట్టి నేర్పు నీకున్నయెడల నిరభ్యంతరముగ రాజునొద్దకుఁ బోవచ్చునని చిలుక పలుక, పద్మిని యప్పటికే యర్థరాత్రమగుటచే శయ్యపైఁ బవ్వళించి, నిద్రనొందెను.

---

# 7 అనూరాధకథ.

——:0:——

రాజకులశేఖరుండైన మన్మథసింహుఁడు మదనశరబాధితుఁడై మంజరిని మఱల పద్మిని యింటికంపెను. నాఁడు తప్పక వచ్చెదనని పద్మిని నచ్చుచెప్పి, సూర్యాస్తమయ సమయమున భోజనాదికముల ముగించి, యందమై మిసమిసలాడు పట్టుచీరను ధరించి, యాభరణభూషితయై ప్రయాణసంసిద్ధయై యుండెను. చిలుక యామెనుజూచి, "అక్కా! నీ యందముచూడ నాకే ఎంతో ముచ్చటగనున్నది. ఆ రాజు కాదుకదా తపోనిష్ఠాగరిష్ఠులైయుండు మహర్షులైన నిన్ను చూచినంతనే కాముక వికారము నందకమానరు. ఈ యాయత్తమంతయు నటకుఁ బోవుటకేనా ? నే నశుభము పల్కితినని కినుకనొందకమ్మా! నీ కింకను జారత్వమున కవసరమైన జాణతన మబ్బలేదు. అదియే యలవడెనా నీ కేమి కొఱత ! నీ యిచ్చవచ్చినచొప్పున స్వైరిణివోలె విహరించవచ్చును. నేఁడు నీ కనూరాధకథ చెప్పెద నాకర్ణింపుము.

తొల్లి శ్రావస్త్యాపురమున వీరసింహుండను వీరుఁడు కలడు. అతఁడు నిరంతరము రాజుకొలువుననే యుండుటవలన నతనిభార్య అనూరాధ యింట రొకర్తుకయే యుండును. ఆమె యసమానసౌందర్యవతి. నవలావణ్యతారుణ్యసంశోభిత. భర్త తఱచుగా నింటలేకుండుటచే అనూరాధ పరపురుషాసక్తి కలిగియుండెను. ఆ పురముననే బ్రహ్మదత్తుండను బ్రాహ్మణయువకుఁ డుండెను. ఆతఁడు పరనారీవ్యామోహితాత్ముడై, వేశ్యాలోలుడై తన ధనమెల్ల వమ్ముచేసికొని, దారిద్ర్యాంధకారమగ్నుఁడై, తుదకు భుక్తిమార్గములేక బాధపడుచుండెను. ఒకనాఁ డతడొక వణిజునిగృహమునఁ బ్రవేశించి ధనము నపహరించి వచ్చు

చుండగా బంధింపఁబడెను. వర్తకుఁ డతనిని రాజు సమ్ముఖమునకుఁ గొంపోయి, ఫిర్యాదుచేసెను. రాజు నేరస్థుఁడు భూసురుఁ డగుటచేఁ గారాగృహవాసశిక్ష విధింపనొల్లక చేతులకు సంకెళ్ళువేయించి, వదలి పెట్టెను. బ్రహ్మదత్తు విచారగ్రస్తుఁడై, మాసినదుస్తులతో నింటింటికి బోయి యాచించుచు కాలము గడుపుచుండెను.

ఒకనాఁ డతడు అనూరాధగృహముకడ కరుదెంచి, తనకు క్షుత్పిపాసలు తీరుట కాహారజలంబులఁ బ్రసాదింపుమని వేఁడెను. కరముల కరదండములుండిన కారణము నెఱింగి, అనూరాధ యతనిని లోనికిఁ గొంపోయి, యా యరదండములు తొలఁగించి, యభ్యంగస్నానముఁ జేయించి, ధరించుటకు పరిశుభ్రవసనముల నొసంగి, యతనితోఁ దృప్తి జనించునట్లు రతిక్రీడల నానందించెను. భర్త యరుదెంచునపుడు కన బడకుండ నొక్కెడ నుంచుచు, వతఁడు వెడలిపోయినంతనే మదనసం గ్రామసౌఖ్యవారాశి నోలలాడుచు నామె దినములు క్షణములట్లు గడు పుచుండెను. ఒకనాఁ డనూరాధ యుపపతితోఁ గూడియున్నతఱి, వీర సింహుఁ డేతెంచి, తలుపుఁదట్టెను. తనజీవిత మానాటితో ముగిసెనని బ్రహ్మదత్తుఁడు భీతినొందెను. అతనిని ధైర్యముగా నుండుమని చెప్పి, మంచముక్రిందదాచి, అనూరాధ తలుపులఁ దెఱచెను. వీరసింహుఁ డరుదెంచి, శయ్యపై గూర్చుండినంతనే, ఆమె "ప్రాణేశ్వరా! అహ ర్నిశములు రాజుకొలువుననే యుందువు. నేనొక్కర్తెను ఉండలేను. ఏవో భూతము లీ గదిలోఁ బ్రవేశించి, వేధించుచున్నవి. నేను శయ నించియుండఁగా మంచమునే ఎత్తుచున్న" వని కంట కన్నీ రొలుకఁ బలికెను. ఆ పలుకుల నాలకించిఁ బ్రహ్మదత్తు ధైర్యముగ మంచము కోడును బైకెత్తెను. అది యేమని వీరసింహుఁ డాశ్చర్యచకితుఁడాయెను. మఱల నింకొక కోడులేచెను. భార్య వచించినది సత్యమేయగుట, భయ

కంపితుండై వీరసింహుఁ డొక్కక్షణమైన నట నిలువకుండ పలాయన మొనరించెను.

ఉపపతిని తనివిదీఱముద్దాడి, యపుడపుడు వచ్చుచుండుమని పలికి, కొంతధనమిచ్చి యనూరాధ వీడ్కొలిపెను. భర్త కనుల నట్లు కారముఁ జల్లగలనేర్పు నీకు లేదని నా నిశ్చితాభిప్రాయము." అని కథ ముగించుసరికి పద్మినికి నిద్రజనించెను. శయ్యాగారమునకుఁ బోవుటకైన నోపికలేక, యామె యచటనే నిద్రించెను.

## 8 లలితాంగికథ.

మఱుచటిదినము సాయంసమయమున నిఁక నానాఁ డెట్లయిన మన్మథసింహునికడకుఁ బోయి తీరవలెనని సంకల్పించుకొన్నదై పద్మిని మనోజ్ఞముగ నలంకరించుకొని యుండెను. చీకటిపడినంతనే చిలుక యామెను జేరంజేరి "నేఁడు రాజునొద్దకుఁ బోవుటకుఁ గృతనిశ్చయవై యున్నట్లు తోఁచుచున్నది. అట్లయిన నీ కథ వినినపిమ్మటనే పోవచ్చు" నని యివ్విధమునఁ జెప్పసాగెను.

మున్ను శోభావతీపురంబున ధనకోటిశ్రేష్టియను వైశ్యుఁడు కలఁడు. జననియు, నతఁడును, భార్య లలితాంగియు నివసించుచుండిరి. లలితాంగి నవయౌవనప్రాదుర్భావమున నుండుటచే వ్యభిచారాసక్తయై వసంతుఁడు, జయంతుఁడునను యువకులతో రహస్యముగ

సంచరించుచుఁ దృప్తినొందుచుండెను. శెట్టి యొకనాఁడు మూఁడురూక
లను భార్యకిచ్చి " నే నొండు కార్యార్థమై పోవుచున్నాను. నాకుఁ
దీఱికలేదు. నీవేపోయి, బియ్యమును దీసికొని ర " మ్మనెను. లలితాంగి
యంగడికిఁబోయి, బియ్యమును గొనివచ్చుచుండగా, దారిలో వసం
తుఁడు కనబడి " హా ప్రేయసీ ! నిన్ను కలిసికొని ఎంతకాలమైనది.
ఇదిగో చూడుము. మన్మథుఁడు నా యొడలినెల్ల తన బాణములచే
గాయపఱచినాఁడు. నీవు నాపై నీ దయార్ద్రవీక్షణముల నొకసారి ప్రస
రింపఁ జేయుదువేని, నా తాపమంతయుఁ జల్లారగల " దనెను.

లలితాంగి ప్రియునిమాట కాదనలేకపోయెను. అతని గృహ
మున కరిగి, యాతని కోరిక నెరవేర్చి, బియ్యపుగంప నెత్తికొనివచ్చు
చుండగా, జయంతుఁడు కనిపించి " నా యన్నులమిన్నా ! నా బంగా
రుబొమ్మా ! నీవు నాలుగైదుదినములనుండి కనబడుటలేదు. నా చిత్త
మంతయు నీయందే లగ్నమైయున్నది. మా యింటి కొకసారి రాకుండ
వెడలిపోవుట న్యాయముకాదుసుమా ! " యనెను. ఆమె యతనికోరిక
నిరాకరించుట భావ్యముకాదని తలంచి, బియ్యపుగంప నా యింటియరు
గుపై నుంచి, లోనికిఁబోయెను. వసంతుఁ డింతలో నా మార్గమునబోవుచు
నీమెను జయంతుఁడు పిలుచుటచూచి, మత్సరగ్రస్తుఁడై పొంచి
యుండి, యామె లోనికిఁబోయినంతనే, యరుగుపైనున్న బియ్యము
గంప నెత్తుకొనిపోయి, పాఱఁబోసి దానినిండ యిసుకనుంచి, యరుగుపై
బెట్టి " లలితాంగికిఁ దగినశాస్తి యిదే " యనుకొని వెడలిపోయెను.

రతివ్యాపరతుల జయంతునిగూడ సంతృప్తుంజేసి, లలితాంగి,
యా గంప నెత్తుకొని, నిజనిలయమున కరిగెను. అత్త యా గంపలోని
యిసుకనుజూచి " అయ్యో ! ఇదేమే ! మూఁడురూపాయల బియ్యము
గొనిరమ్మంటినా, యిసుకను గొనిరమ్మంటినా " యని ప్రశ్నించెను.

ఆ యినుకను జూచి, తన్నవమానింపఁ బంచించెనని యెంచి, " అత్తా! రూక లెచటనో కొంగునుండి జారిపడిపోయినవి. ఎంత వెదకినను కనిపించలేదు. అందుచేత నటనున్న యినుక నెల్ల ఎత్తికొనివచ్చినాను " అనెను. అత్త యా యినుకను వెదకి, రూకలు కానరానందున నొకనిట్టూర్పువిడిచి, యూరకుండెను.

లలితాంగివలె గడుసుదానవు కావు. సమయస్ఫూర్తిగలిగి యన్నృతములైనఁ బలుకలేవు. ఏమి చేయుదువమ్మా! యనెను. పద్మిని కా పలుకు లధైర్యము కలిగించినవి. ఆమె మఱుచటిదివసమునఁ బోవచ్చుననిఁ బద్ధకించి, శయ్యపై నొరిగెను.

# 9 ప్రియంవదక

నాఁటిరాత్రి పద్మిని గంధకస్తురికాది సుగంధద్రవ్యంబుల మేన నలఁదికొని, రాజాంతఃపురమునకుఁ బోవుట కుద్యుక్తయై యుండఁగా, నా రామామణింగాంచి, శుక మిట్లనె—" సోదరీ! నవలావణ్యవతీ! నా పలుకుల నాలకించి, నెఱజాణవై వెలయఁ బ్రయత్నింపుము. పర పురుషసాంగత్యము నుద్దేశపూర్వకముగఁ జేసినను, చేయకపోయినను, దానిం గప్పిపుచ్చుకొనుటకుఁ దగిన చాతుర్యముండవలె. నేఁడు నీకుఁ బ్రియంవదకథ నెఱిఁగింతు నాకర్ణింపు " మని యిట్లు చెప్పసాగెను—

పూర్వము విజయవాడ నగరంబున విష్ణుశర్మయను విప్రుఁడు కలఁడు. ఆతనిభార్య సుగుణవల్లి, ఆమెయందు తనకు సంతానము కలుగనందున, నా భూసురుఁడు వార్ధకదశ ప్రాపించుచున్నదశలో ద్వితీయ వివాహముఁ జేసికొనెను. సవతు లిర్వురు నొకేచోట నివసించుచున్నచో గయ్యములకుఁ గాలుద్రవ్వుచుందురని యిరువురు భార్యలను వేఱొక వీధిలో నుంచెను. ఆతని రెండవభార్య ప్రియంవద యదృష్టవశమున గర్భవతియై యొకశిశువును గాంచెను.

విష్ణుశర్మ ప్రియంవదయందే గాఢానురాగముకలిగి యామె గృహముననే నివసించుచుండెను. అతఁడు వేదములను బాలురకుబోధించు వృత్తిగలవాఁడగుట నెందఱో యతనికడ విద్యాభ్యాసము జేయుచుండిరి. వారిలో నారాయణశర్మ నవయౌవనోద్భాసితుఁడై యుండెను. తనభర్త వయసుమళ్ళినవాఁడగుటచేతను, యింటిలో కనులపండువగ నారాయణశర్మ మెలఁగుచుండుటచేతను, ప్రియంవద చపలహృదయ యయ్యెను. అవకాశమొదవినప్పుడెల్ల యామె యతనింజూచి రతికేళిం దేలుచుండెను. ఒకనాఁడు గురువుగారు పాఠముల బోధించుచు నారాయణశర్మంజూచి "ఓయీ! అటకపైనున్న యుపనిషద్గ్రంథమును గొనిరమ్మ" న్నెను.

నారాయణశర్మ లోనికేగి యటుకపై కెక్కినంతనే, ప్రియంవద తలుపుల లోపలబంధించి, తానును మిద్దెపై కెక్కి యతనితో భోగసాగరతరంగమాలికలఁ దేలియాడెను. శిష్యుఁ డెంతసేపటికిని రాకుండుటచే గురువులేచి తలుపుతట్టెను. నారాయణశర్మ భయకంపితుఁడై గడగడ వణకుచుండుటచే, ప్రియంవద యా తాళపత్రగ్రంథమును విప్పి, పత్రములనన్నిటినిఁ జిందరవందరగ యటునటు విరఁజిమ్మి, తలుపుఁదెఱచి "అదుగో! మిద్దెపైనుండి దిగుచుండఁగా, చేయిజారి తాళపత్రగ్రం

థము క్రిందబడి, యిటునటు చెదరిపడుటచే, మీరుచూచిన దండింగు రని బిక్కమొగముపై చికొని, తలుపుల బంధించి, సరిచేయుచున్నాఁ” డనెను. గురువు ప్రియంవద పలుకులనెడి యమృతముఁగ్రోలి, శిష్యునితోఁగలిసి, యా పత్రముల నరిచేసి, పాఠముఁ జెప్పెను. “అక్కా! ప్రియంవద చమత్కారమును జూచితివా? అట్టి చమత్కృతియైన నీకు లేదే? ఒకవేళ నేదైన విపత్తు ఘటిల్లునెడల నెట్లు దాటిరాగల”వని యడిగెను. ఆ ప్రశ్న సహేతుకముగఁ గాన్పించుటచే, పద్మిని యానాటికి తన ప్రయత్నమును మానుకొని, శయ్యపైఁబరుండి, క్షణములో నిద్రావివశయయ్యెను. శుకమును మఱుచటిదినమునకుఁ దగినకథను గూర్చి యోచించుకొనుచు, కునుకుచుండెను.

# 10 సోమిదేవికథ.

తానుపేక్ష వహించినందులకు మన్మథుసింహాయుఁడు గర్వితమతి యని యెంచునేమోయని భీతిల్లి, పద్మిని పెందలకడనే భోజనాదికముల ముగించుకొని, యలంకరించుకొని రాత్రి యెప్పుడేగుదునాయని యోచించుకొనుచు శయ్యపైఁ బరుండి నిద్రించెను. ఆమె యొకగంటకుఁబిదప మేల్కాంచి, బయలుదేఱునంతలోఁ కీరము “పోదలచిన దానవు పెందలకడనే బోవలసినది. ఇప్పుడా పోనెంచుట? గాఢాంధకారమున, నొంటరిగఁబోవుట—అందులో సకలాభరణభూషితవై వెడల బూనుట ప్రమాదకరముగాదా! అక్కా! నీకంతగాఁ గోర్కెయున్నచోఁ దేపటిదినంబునఁ బోవచ్చు” ననెను.

"సరే. నా రామచిలుకా! చక్కనికథను వక్కాణింపుమా" యని పలికిన, నా కీరము కిలకిలనవ్వి యిట్లు నుడువదొడఁగెను.

తొల్లి వైశాలీనగరంబున బృహచ్ఛాస్త్రియను బ్రాహ్మణ యువకుఁ డుండెను. అతఁడు విద్యాభ్యసనతత్పరుఁడై కాశీపట్టణము నకుఁబోయి, పెక్కుమంది పండితుల నాశ్రయించి, యశేషపాండితీ ప్రకర్ష నలవఱచుకొని, తిరిగి స్వగ్రామంబునకు వచ్చుచు గయాక్షేత్ర మున నొకసత్రమున విశ్రమించెను. యాత్రార్థమై యరుదెంచిన వైశ్యదంపతు లా సత్రముననే యా రాత్రి విశ్రమించిరి. వైశ్యుఁ డైన రామిశెట్టిభార్య మిగుల సౌందర్యవతియై, చెన్నొందుచుండెను. నవయౌవనభాసురయైన యామెనుగాంచినంతనే, బృహచ్ఛాస్త్రికి మన నవికార మొదవెను. శెట్టి పగలంతయుఁ దిరిగితిరిగి, యలసియుంటచే గుఱ్ఱుపెట్టుచు నిద్రపోవుచుండెను. శాస్త్రి మెల్లగాలేచి, దీప మార్పి వైచి, యామెతోఁ గ్రీడించెను. నిదురమైకమునఁ దనభర్త పర పురుషుఁ డటున్నాడను సంశయమైనలేక క్రీడించుట కంతసిగ్గుమాలిన వాఁడో యని తలఁచి యూరకుండెను.

ఉదయమున నిదురనుండి మేల్కాంచినపిదప "నాథా! అది యేమిపని? ప్రక్కగా నా బ్రాహ్మణయువకుఁడు పరుండియుండగనే భోగక్రీడలఁ దేలవలయునా?" యని యడిగెను. అతఁడు తెల్లఁబోయి "అదేమి? శయనించినది మొద లింతవరకు నొడలెరుంగకుండ నిద్రించి తిని. ఒకవేళ నా బ్రాహ్మణ కుమారుఁడే యట్లొనర్చెనేమో!" యనెను. బ్రాహ్మణుఁడే యట్లొనరించెనని గ్రహించి, యా చెల్లదన మును బ్రకటింపక, సోమిదేవి "ఛీ! అట్లనెదరేల? నాకు నిజముగా మీరు నా శయ్యలోనికివచ్చి, గాఢాలింగన మొనరించి, చెక్కిలినొక్కి

ముద్దాడి రమించినట్లయినది. అది కలయేమో! నేను నిజమనే భ్రమించితి” ననెను.

శెట్టి యామె పలుకులు యదార్థములని విశ్వసించి, ఊరకొనెను. అక్కా! ఏమైనఁ జెప్పుము. నీ వట్లసత్యములఁ బలుకలేవమ్మా!

చిలుక కథముగించుసరికి నిద్రాదేవి పద్మిని నావహించెను. వెంటనే శయ్యాగృహమున కరిగి, నిదురించెను.

# 11 ఇందుమతికథ.

పద్మినికి నానాఁటికి రాజుపై ననురాగము హెచ్చుచుండెను. ఆతనిపొందు వందనేరని తనజీవితమే నిరర్థకమని తలపోసెను. అతనితోడి రతిసౌఖ్యమునందని, తనయౌవన మడవిఁగాచిన వెన్నెలయని భావించెను. ఎట్లయిన నానాఁడు రాజాంతఃపురమునకుఁ బోయితీరవలెనని దృఢముగ నిశ్చయించుకొనినదై, జగన్మోహనకరముగ నలంకరించుకొని, చిలుకదగ్గరకువచ్చి తన నిశ్చితాభిప్రాయము నెఱిగించెను. కీరము “అక్కా! నా పలుకులఁ బెడచెవినిఁ బెట్టుచున్నావు. ఆపదను శంకింపకున్నావు. ఇది యొకనాఁటితోఁ బోవునదికాదు. ఒకసారి వ్యభిచారమునం దనురక్తి జనించెనా, నీ యాజన్మాంతము నా దుర్బుద్ధి వదలదు. దానివలన నీ కెప్పుడో యొకప్పుడు ప్రమాదము చేకూరకమానదు. కావురమునకే మోసము వచ్చుననుమాట నూహింపఁజాలకున్నావు. నీ కింత యిచ్ఛయున్నచో నేనే మంచిసమయమును జెప్పెదను లెమ్ము, నేఁటి

కీకథ నాకర్ణింపు" ము. ఇది వినుటవలననైన నీకు గడుసుఁదనము, జాణతనము, చాతుర్యము నలవడునని యాశించుచున్నాను. అనెను.

"పూర్వము విశ్వేశ్వరపురంబున గర్గుఁడను బ్రాహ్మణోత్తముఁడు నివసించుచుండెను. అతని యేఁబదియవయేట ప్రథమకళత్రము మృతి నొందుటచేఁ బునర్వివాహముఁ జేసికొనెను. రెండవభార్య ఇందుమతి పతి కెదురాడుచు, విసిగికొనుచు వేధించుచుండెను. ఇరువురు నన్యోన్యానురాగములేక నిరంతరము కలహించుచుండిరి.

ఇందుమతి నవయౌవనోజ్జ్వలాంగియై, ముసలిమగనివలన కాముకసౌఖ్యము నందఁజాలక, పరపురుషాసక్తి కలిగియుండెను. ఆమె జలమును గొనివచ్చుటకై ఘటమును బూని, నదికి వెడలెను. నదీతీరమున నొక బ్రాహ్మణయువకుఁడు కృష్ణశర్మ యనునతఁడు స్నానముఁ జేయుచుండెను. అతఁడు నవయౌవనసంపన్నుఁడై యుండెను. ఇందుమతి రూపలావణ్యము లాతని హృదయకుహరమున ప్రేమానలము నుత్పన్నముఁ జేసెను. ఆమె ప్రవర్తనమెట్టిదో తెలియనెంచి, యతఁడు మందహాస మొనరించెను. ఆమె బదులుగా చిఱునవ్వువెన్నెలల నతనిపైఁ బ్రసరింపఁజేసెను. ఇరువురును పరస్పరము దృష్టులతోనే కొంతతడవు ప్రసంగించుకొన్నపిదప, శర్మ "సౌభాగ్యవతీ! నీ పేరే?" మని ప్రశ్నించెను—

"ఇందుమతి యందురు. తమ నామధేయము—"

"కృష్ణశర్మ—కామినీ! ఇట నెవరునులేరు కావున యొకింత సాహసమూనినందులకు మన్నింపుము. నేను రామేశ్వరమునుండి వచ్చుచున్నాను. వాయసపురము మా స్వస్థానము. ప్రణయతృష్ణ నన్ను

పీడించుచున్నది. నీ ప్రేమామృత మొకింత ప్రసాదించి, నా దాహము తీర్పుమా !"

"నవమోహనాంగా ! ప్రథమదృక్పాతముననే వృద్ధపతీసంయోగకారణమున నెండిపోయిన నా హృదయోద్యానవనమునకు నీ శృంగారవాగ్వర్షము వసంతుర్తుభాసమానమై పరగినది. మా నిలయమునకు రమ్ము. నేను లోనికేగినపిదప వచ్చి "ఇందుమతీ !" యని పిలువుము. తరువాత నేఁ బ్రదర్శించు కపటనాటకమున కీవు సూత్రధారివై పాత్రనిర్వహణముం జేయు" మని యామె వెడలిపోయెను.

కామాతురుఁడై యున్న కృష్ణశర్మకు జగమెల్ల నిందుమతీమయమై తోఁచినది. స్నానానంతరము ఆమె ననుసరించి వెడలి, గృహమును గుర్తించి, మార్గస్థు నొకనింబిలిచి యిందుమతి భర్త గర్గుఁడని తెలిసికొని "ఇందుమతీ!"యని యాగృహప్రాంగణముననిలిచి, పిలిచెను.

గర్గుఁ డీవలకువచ్చి "ఏవూరయ్యా !" యని ప్రశ్నించునంతలో నిందుమతి యీవలకువచ్చి "ఓహో ! బావగారా ! దారితప్పి వచ్చినట్లున్నది. అది యేమిటి ? మా మేనత్తకొడుకు కృష్ణశర్మ. ఏవూరయ్యా అని యడుగుచున్నారు. ఇదియేకాబోలు బంధుమర్యాద !" యన్నది.

"పదిసంవత్సరములయినదిగదా నేను విద్యాభ్యాసమునిమిత్తమై నవద్వీపమునకువెళ్లి, తిరిగి యిపుడు వచ్చుచున్నాను. ఇంటివద్ద మనవారందఱును కుశలముగనున్నారుగద !" యన కృష్ణశర్మ తనపాత్రను బోషించెను. తెలియక యట్లడిగినందుల కన్యథాభావించవలదని, గర్గుఁ డాతనిని భోజనమునకు లెమ్మని యాదరించెను. భోజనానంతర మతఁడు ప్రయాణసన్నద్ధుఁడు కాఁగాఁ గర్గుఁడును, నిందుమతియుఁగూడ నానాటికి వారి యింట నుండవలసినదని కోరిరి.

ఆ నాఁటిరాత్రి కృష్ణశర్మకు వీధియరుగుపైఁ బ్రక్కవైచి, ఇందుమతి తనమనోరథసిద్ధికై యుపాయాన్వేషణము చేయఁగడంగెను. ఎట్టకేల కామె కొకయాలోచనఁ దట్టినది. భర్త నుద్దేశించి "ఏమండీ! ఎల్లుండినుండి శ్రావణమాసము. ప్రతిమంగళవారము, శుక్రవారము పేరంటకములకుఁ బోవలయునుగదా! నాకొక్క నగైనలేదు. ఒక్క పట్టుచీరయైన లేదు. ఇంట్లోసుఖము లేకున్నమానె—" అని సాధింప నారంభించెను.

గర్గుఁడు చాలసేపోపికతో నూరకుండెను. ఆమె యట్లదేవనిగా విసిగెత్తించుటచే నతనికి కోపమువచ్చి, దాని నాపుకొనలేక, భార్యను చరచర యీడ్చుకొనివచ్చి, వీధిలోనికిగెంటి లోనగడియవైచికొని, నిశ్చింతగా నిద్రించెను. తన యుపాయము సఫలమైనందులకు నిరవధి కానందమంది, ఇందుమతి వీధిలోని గొళ్ళెమువేసి, కృష్ణశర్మతో నారే యెల్ల పూవిలుకాని కదనమొనరించి, సంతృప్తినందెను. తెల్లవారుఝాముననే కృష్ణశర్మ వెడలిపోయినంతనే, ఇందుమతి రోదనమారంభించినది. ఆ విలాపమును విని, యిరుగుపొరుగువారు గుమిగూడిరి.

"అయ్యలారా! రండి. అమ్మలారా! చూడండి. ముసలిమగనికిఁ గట్టిపెట్టి నా కొంపకూల్చినారని నే నేడ్చుచుండ, పరకాంతను బ్రక్కలోఁ బెట్టుకొని కులుకుచున్న నా భర్త కింతగడ్డిపెట్టండి. నన్నీవలకు గెంటివైచిన న్యాయముచూచి, మీరైన నా కష్టముల గట్టెక్కింపరా!" యని ఇందుమతియేడ్వ నందఱును గర్గుని కేకవైచి "ఛీ! నీ కిది తగ"దని మందలించిరి. తన దురదృష్టమును వే విధముల నిందించుకొనుచు గర్గుఁ డామె నింటిలోనికిఁ గొంపోయెను—"

పద్మిని యీ కథవిని, ప్రొద్దుపోవుటచే, నిద్రావివశయయ్యెను.

---

# 12 కృష్ణవేణిక

———:o:———

"అక్కా ! పద్మినీ ! నేఁడు నీ వట్లు వెలవెలఁ బోవుచున్నా వేమి? రాజుతోడి సంయోగమున కవకాశము లేకపోవుచున్నదేయని బెంగ గొనియుంటివి. రంకుతనము చేయు నేర్పరితనము నీకు లేదు. దాని నల వఱచుకొందువేని నీకు క్షేమమగును. నేఁడు నీకు కృష్ణవేణికథను దెల్పెదు నాకర్ణింపుము." అని యా చిలుక యీ విధముగాఁ జెప్ప సాగెను—

తొల్లి యమరావతీపురంబును జయవర్ధనుఁడను రాజు పాలించు చుండెను. అతనికడ వీరకేతుఁడను సేనానాయకుఁడు కలఁడు. ఆ సేనా నాయకునకుఁ గృష్ణవేణియను భార్యకలదు. ఆమెసౌందర్య మనుపమా నము. వారి యింటికిఁ బరపురుషుఁడు రాకుండ కట్టుదిట్టములను జేసి, వీర కేతుఁడు తనభార్య యతిలోకరమణీయ సుకుమారగాత్రయని గర్వించి యుండెను. ఒకనాఁడు వారి యింటికి రైతువచ్చి, వివిధములైన ఫలముల నిచ్చెను. అతఁ డట్లే యనుదినమువచ్చి పండ్లిచ్చి పోవుచుం డెను. లోపలనుండి కృష్ణవేణి యా రైతును జూచి మోహావివశయై "ఆహా ! రైతుబిడ్డ ఎంతయందగాఁడు ?" అని తలంచుకొనెను.

ఆ రాత్రి యామె భర్త నుద్దేశించి "నాథా ! ఆ రైతు పొల మునుండి యెన్నో తెచ్చి యిచ్చుచున్నాఁడుగదా ! వాని కేమైన నీయ కున్నారే. అది న్యాయమా !" యనెను—"సరే. దానికేమి చేసి చ్చెద" నని, యా రైతు మఱునాఁడు రాఁగా, చక్కని ముత్యాలహార మును బహుమానముగా నొసంగెను. ఆ రైతు వలదని వారించి

"అయ్యా! నా కొక్కసారి మీ యింట భోజనమిడినఁ జాలు, నీ హారములు నా కేల?" యని బదులు పలికెను.

అట్లే యని, వీరకేతుఁ డా రైతును మఱునాఁడు భోజనమునకు రమ్మనెను. రైతుపేరు రాఘవుఁడు. రాఘవుఁడు మఱుచటిదినమున భోజనమునకు రాగానే వీరకేతుఁడు దగ్గఱకూర్చుండి "శిరస్సు పైకెత్తితివా జాగ్రత్త" యని, భార్యను వడ్డింపుమనెను. కృష్ణవేణి వడ్డన జేయుచుండఁగా, నామె ప్రతిబింబము జలమునఁ బ్రతిఫలించెను. అది చూచి యతఁడు విమోహితుఁ డాయెను. భోజనానంతరము రాఘవుఁడు వెడలిపోయెనేగాని, యతని కేమి చేయుటకును దోఁచదాయెను. నిద్ర జనింపదు. ఆహారముపై మనసుపోదు. వ్యవసాయమన్న బద్ధకము. అతఁడు "ఆమెపొందుఁ బడయనేరని నా జన్మమేల కాల్పనా?" యని కాళికాలయమునకుఁ బోయి, యా దేవికి మ్రొక్కుకొని యటనే కూర్చుండెను.

ఇచట కృష్ణవేణి స్థితియు నట్లేయుండెను. అతనిరూప మామె హృదయమున గాఢముగా నాటుకొనిపోయినది. ఆలయమున వ్యథితాత్ముఁడై కూర్చుండియున్న రాఘవునికడ కొకయోగి వచ్చెను. ఆగతానాగతవేదియగు నా సాధువు రాఘవునిం గని "ఓయీ! నీ విచారమునకు మాకు యోగదృష్టివలన—హేతు వేదో తెలిసినది. ఆమెయెడ ప్రగాఢప్రణయపాశబద్ధుఁడవై యుండుటచే నీ యెడ నెనరు చూపుచున్నాము. నీ విటనే యుండుము. నే నేగి యామె నిటకుఁ బంపెద" నని తిన్నగా బయలుదేఱెను.

ఇంతలో నాకసము నీలమేఘావృతమయ్యెను. మెఱపులు—ఉరుములు నారంభించినవి. వర్షమారంభమైనది. ఆ యవిరళవృష్టిపాత శబ్దమును, గభీరాంధకారమును, లెక్కచేయక యోగి తిన్నగా వీరకే

తుని గృహమున కరుదెంచి "భవతిభిక్షాందేహి" యనెను. బదులు రాలేదు. తన మాయామహిమచే నతఁడు వృద్ధురాలివేషము ధరించి "అమ్మా! ముసలిదాన నింత యన్నము పెట్టెదరా?" యని కేక వేసెను.

కృష్ణవేణి తలుపు తెఱచి యన్నము పెట్టుచుండ నా వృద్ధురాలు "రైతుబిడ్డ రాఘవుఁడు వచ్చె" నన్నది. మందహాసముచేసి యామె లోనికి వెడలిపోవుచుండ, నా ముసలిది "అమ్మా! వర్షము జోరుగా నున్నది. ఈ నిబిడాంధకారమున నే నెచ్చటకిఁ బోగలను. ఈ రాత్రికి యరుగుపైఁ బండుకొందు" ననెను. కొంతసేపైనపిదప "నాథా! ఇది మంచిపుణ్యము నాపాదించుకారై. ఇప్పుడు వర్షమునఁ దడసినయెడల సంతానము కలుగును. ఒకసారి తడిసిరానిందు" అని కృష్ణవేణి యడుగ "ఏమో! స్త్రీలు చంచలమనస్కులు. నీ వేమిచేయుదువో యెవరు చెప్పఁగలరు. కావున వల" దనెను.

"అయ్యో! అదేమినాథా! అట్లనెదరు? ఇంతలోనే యేమి యపరాధ మొనరింతును. మీ కంతయనుమానముగనున్న యెడల నీ త్రాటితో నా చేతిని కట్టుకొందును. దానిని మీరు పట్టుకొనుఁడు" అని కృష్ణవేణి పచింప, నతఁడంగీకరించెను. త్రాటికొస నొండతని కరమున నిడి, యొక కొస తాను కేలునకుఁగట్టికొని వీథిలో వర్షమున నిలుచుని యుడ, వృద్ధురాలిరూపముననున్న సన్యాసి యా త్రాడు తనచేతికిఁ గట్టుకొని "ఊరివెలుపలనున్న కాళికాళయమునకుఁ బోయి ర" మ్మనెను. ఆమె చరచర నా కోవెలలోనికిఁబోయి వియోగానలమున భస్మీభూతుఁ డగుచున్న రైతు రాఘవు నాలింగనమొనరించుకొని, కాముక క్రీడల సాక్షిఁ బోలి తిరిగి యింటికివచ్చి "నాథా! పూర్తిగాఁ దడిసినా" నని లోపలకుఁబోయెను. వృద్ధురాలి రూపమునువిడిచి, సన్యాసియు నాలయమునకుఁ బోయి, యతిని మెప్పుఁబడసెను.

"అక్కా ! నీకింత నేర్పరితనములేకున్న జారత్వముపై నపేక్ష గలిగియుండుట అపహాస్యము" యని కీరము ముగించుసరికి, నిద్రాదేవి యావహించిన పద్మిని గాఢనిద్రాపరవశయై, సుఖస్వప్నములం గాంచసాగెను.

---

# 13 విజయలక్ష్మి కథ.

—:o:—

ఆనాఁడు తప్పక రాజునొద్దకుఁ బోనెంచినదై పద్మిని యసాధారణముగ నలంకరించుకొని, ప్రయాణసంసిద్ధయై, తానేగుట కింకను వ్యవధియుండుటచే, చిలుకను సమీపించి "అనుదినమును నీవు వలదనుచుండుటచే నేను నీ మాట నిరాకరించలేకపోవుచున్నాను. నేఁడు తప్పక పోవుదాన. అంతవఱకు నేదైన కథచెప్పు" మన, కీరము కిలకిల నవ్వి "అక్కా ! నీ కెంత తోఁచిన నంతియేగాని మా హితముల వినవేమి. అయినను విను" మని యివ్విధమునఁ జెప్పసాగినది.

తొల్లి కురువిందపురంబున రామపాలుఁడను శ్రీమంతుఁడు కలఁడు. అతనికి విజయలక్ష్మి భార్య. ఆమెయందు తనకు సంతానము కలుగకపోవుటచే ఖిన్నుఁడై, యా రామపాలుఁడు మఱియొక కన్యం బరిణయమై యామెవలన నొకకుమారునిఁ గాంచెను. రెండవభార్యయెడలనే యనురక్తికలిగి మెలఁగుచుండుటచే విజయలక్ష్మి పరపురుషాయత్తచిత్తయై, తమయింటఁ బూజసేయు బ్రాహ్మణయువకునితోఁగూడి యానందించుచుండెను.

సవతికుమారుడు నళినీకాంతుడును ఆ నాటిరాత్రి యామెయొద్దనే శయనించి నిదురించెను. వేకువఝామున బ్రాహ్మణయువకుడు వచ్చి, విజయలక్ష్మింగూడి క్రీడించుట నా బాలకుడు చూచెను. ఆ నాటి రాత్రి భోజనాగారమున బాలకుడు తండ్రి రామపాలు నుద్దేశించి "నాయనా! నాకు నీవేగాక మఱొకతండ్రి కూడ కలడుసుమా. నేను రాత్రి చూచినా" ననియెను. విజయలక్ష్మి కనుసన్న చే బెదరించెను. భోజనానంతర మామె యా బాలు నెత్తుకొని, తనగదిలోనికిం దీసికొనివెళ్ళి తినుబండారముల నిచ్చి "నిన్ను నే నెంతో ప్రేమతోం జూచెదను. నాయనా! నాపై నట్టికొండెములును జెప్పకు" మని బ్రతిమాలెను.

అందఱును భోజనములుచేసి, హాలులోనికి వచ్చినపిదప కుమారుని పలుకుల నాలోచించి, సంశయాకులితమానసుడైన రామపాలుడు "నాయనా! నీకు మఱొకతండ్రి యున్నాడంటివిగదా! అతనిని చూపింపు" మనెను. పుత్రుడు నవ్వుచు "నాన్నా! అదుగో చూడు" మని దీపపుకాంతిలో గోడపై ప్రతిఫలించిన జనకుని నీడను జూపెను. తనయుని బాల్యచాపల్యమునకు హర్షించి, నిష్కారణముగా భార్య శీలము శంకించినందులకు బశ్చాత్తాపపడియెను.

"ఆమెవలె నీవు చేయలే" వని కీరము పలుకుసరికే పద్మినిని నిద్రాదేవత జోకొట్టుచుండెను. ఆ నాటి కామె జతనము వ్యర్థమైనందుల కెంతయు సంతసించి, తానును కునికెను.

# 14 చతురికకథ.

ఆ నాఁటిరాత్రి రాజసన్నిధానమునకుఁ బోవుదమనియెంచి, సకలాభరణవిభూషితయై, బయలుదేఱనుండ, కీరము పిలిచి "అక్కా! ఎంతగాచెప్పినను నా హితవాక్యములఁ బాటింపకున్నావు. అట్లయిననేమి నేను చెప్పఁబోవు చతురిక కథ నాకర్ణించినపిదప పొ"మ్మని యివ్విధమునఁ జెప్పసాగెను.

తొల్లి ప్రసన్నవతీపురంబును విశ్వాసింహుఁడనురాజు పాలించుచుండెను. ఆతనికి సుమతియను భార్యకలదు. రాజొకనాఁ డామెను జూచి "ప్రేయసీ! నాకు నారీహృదయము నెఱుంగవలయునని యున్నది. అందులకు నీ వేమందువు?" అని యడిగెను. అపు డామె తన హృదయేశ్వరు నుద్దేశించి "నాథా! మీ యభిప్రాయము సమంజసమైనదే. కాని ఒకమాట నిజము. నారీహృదయము నెఱుంగుటకా నలువకైనఁ దరముకాదు. ఉదయముననే వెడలి యూరి మధ్యనుండు బావిదగ్గరకుఁబోయి యొకగడియసేపు నిలిచియుంటిరా మీకు స్త్రీహృదయము తేటపడు" ననెను.

రా జట్లేయని యుదయముననే యా బావికడ కరిగెను. స్త్రీలందరువచ్చి యనేకవిధములైన సంభాషణ జేయుచుండిరి. ఇంతలో చతురికయను యువతి రాజును విలోకించి "ఓహో! ఎంతోసేపటినుండి చూచుచున్నాను. ఈ రాజేల నిచ్చోట వేచియున్నాఁ"డని సంశయించి, ధైర్యమువహించి "రాజేంద్రా! నేఁడీ బావిదగ్గఱకువచ్చి, మా సంభాషణల నాలకించుచున్న కారణమే?" మని యడిగినది.

విశ్వాసింహుఁ డామె నుపలక్షించి, "కోమలీ! స్త్రీచిత్తము నెఱుంగఁ దలచి వచ్చినా" ననెను. "అట్లయిన రెంటినెక్కి మూడింటినిఁ జేపట్టి ప్రొద్దుకాని ప్రొద్దున కత్తివాడిసందున మానంకప్పే మద్దిచెట్టుదగ్గఱకు వచ్చినయెడల నీకు నాహృదయము బోధపడును". అని యా చతురిక వెడలిపోయెను. ఆమె పలుకులయంతరార్థ మెఱుంగక, విశ్వాసింహుఁ డింటికిపోయి మౌనముగ శయనించెను. సుమతివచ్చి, ప్రాణేశ్వరుని ప్రశ్నించి, యా చతురికపలుకుల నెఱింగి "నాథా! ఇంతమాత్రము నకే ఖిన్నతవహింతురా! ఆ మాటలయర్థము మీకు నే నెఱింగింతు నాలకింపుఁడు. ప్రొద్దుకాని ప్రొద్దునఅనగా రాత్రి రెండుఝాములవేళ పాదరక్షలధరించి తాంబూలముతో వజ్ఞాబత్తునియింటికి, కుమ్మరివాని యింటికిమధ్య ప్రత్తిచెట్టుకడకు వచ్చినచో స్త్రీహృదయము తెలిపెద" నన్నది. ఇష్టమైనచో నటకుఁబోయిరండు" అనెను.

విశ్వాసింహుఁ డామె చెప్పిన యానవాళ్ల ననుసరించి, యటకుఁ బోయెను. చతురికభర్త గ్రామాంతరమునుండి యానాఁడే వచ్చెను. రాజు వచ్చునేమో యాశాభంగము కలిగించినదాన నగుదునని యామె విచారభరితాత్మయైయుండెను. రెండుఝాములవేళ పాణిద్వారము తెరచిచూచెను. రాజు కనిపించినంతనే ఆమె ఒకచిన్న దేవతావిగ్రహ మును కౌగిటమునజుట్టి గిరవాటువైచి, లోనికిఁబోయెను. ఆ విగ్రహ మును జూచికొని, యేమియు బోధపడక రాజింటికిఁబోయెను. నిజేశుని వదనమండలము విషాదజలధరావృతమై యుండుటచే సుమతి "నాథా! విచారగ్రస్తులై యుంటిరేల? కారణము తెలుపరాయని ప్రతి మాలెను. విశ్వాసింహుఁడు "నిజమే, స్త్రీచిత్తము నెఱుంగుట కడు దుర్లభము. ఇదిగో! చూడు మామె విగ్రహామును విసరిన" దనెను.

సుమతి యదిచూచి “ప్రియతమా! దీనికై యింతవ్యాకుల పాటేల? ఆమె నెఱజాణ. నిన్ను కాళికాలయమునకు రమ్మని యామె యిందుమూలమున దెల్పినది. రేపటిరాత్రి యటకేగు” మనెను. రాజు మనోహరముగ నలంకరించుకొని యాలయమున కరిగెను. భర్త నిద్రించినపిదపఁ జతురికయు నత్యంతమనోహరములైన దుస్తులధరించి, పూజాద్రవ్యముల నొకపళ్ళెరముననిడి యాలయమునకరిగి, రాజును జూచి “ఓహో! నా మనోనాయకా! ఇపుడైన నారీహృదయ మిట్టిదని యవగతమైనదా?” యని ప్రశ్నించెను. అవునని యతఁడు పలికి, యయ్యిందునదనంగూడి సంతృప్తాత్ముఁడయ్యెను. ఆమె నిజనిల యమున కరుగుసరికి భర్త మేల్కాంచి, భార్యనుకానక యామె పర పురుషసాంగత్యము నెఱపుటకై యెటకోపోయియుండునని “రానిమ్ము, చంపెద” నని కత్తి నూరుచుండెను.

చతురిక తిరిగివచ్చినంతనే యామె నాథుఁడు “ఓసీ! దుర్మా ర్గురాలా! అర్ధరాత్రమున నెటకుఁబోయినా?” వని నిర్బంధింప నామె “నీవు గ్రామాంతరమునకరిగి పెక్కుదినములగుటచే తిరిగి సేమముగ నిలుసేరినచో నర్ధరాత్రమున వచ్చి పూజింతునని దేవికి, మ్రొక్కు కొంటిని. అది తీర్చుకొనివచ్చుట మహాపరాధమాయెనా, పోనిమ్ము. నీకు వధించుటయే ముఖ్యమైనచో నట్లే కాని” మ్మనెను.

భర్త యామె పలుకులను విశ్వసించి, క్షమించెను. నారీహృద యము దుర్భేద్యమని రాజు గ్రహించి, సుమతితో జరిగినదంతయుఁ జెప్ప, నాయమ “సముద్రపులోతైన నరయసాధ్యమగుఁగాని, స్త్రీ చిత్తము నెఱుంగుట దుర్లభ” మనెను.

అక్కా! కథ యెట్లున్నది. చతురిక సార్థకనామధేయయని యొప్పుకొందువా? యని ప్రశ్నించెను. పద్మిని యప్పటికే నిద్రాముద్రితయైయుండెను.

## 15 విమలకథ.

—:0:—

పద్మిని యాదినంబున నరిగంచుచీర ధరించెను. పట్టుదిరైక తొడిగి, మేలైన యాభరణముల ధరించి, మన్మధసింహుని తాపమును జల్లార్చి, తాను సంతృప్తయగుటకై పోనుండ చిలుక "అక్కా! నిన్న నేను కథ ముగించకుండగనే నిద్రించినావు. జారత్వమున చాకచక్యముకలిగి, మెలఁగఁగలవారే సంచరింపవలెను. అట్టి చాతుర్యముతో ప్రవర్తించిన విమలకథ విని యానందింపుమా" యని యివ్విధముగఁ జెప్పసాగెను.—

పూర్వము సౌరదేశంబును మానపాలుఁడను నృపాలుఁడు పాలించుచుండెను. ఆ రాజన్యునకు చంద్రసేనుఁడను తనయుఁడు కలఁడు అతఁడు నవయౌవనవంతుఁడై, తలిదండ్రులమాట పాటింపక తిరుగుచుండుటచే తండ్రి యొకనాఁడు పిలిచి "నాయనా! నేను వృద్ధుఁడ నగుచున్నాను. రాజ్యభారమువహించి, దేశమును ప్రజానురంజకముగఁ బాలింపవలసిన నీవు యివ్విధముగఁ దిరుగుట క్షేమకరముకాదు. దేశాటనమువలన నెంతేని యనుభవముకలుగును. నా పలుకుల నాలకించి,

నేఁడే బయలుదేఱి దేశాటనమొనరించి, విజ్ఞానోద్దీపితహృదయుఁడవై రమ్ము" అని వలయు ధనమొసంగెను.

రాజకుమారుఁడు చంద్రసేనుఁడు బయలుదేఱి, అంగ వంగ కళింగ కాశ్మీర ఘూర్జరాదిదేశంబులును, పెక్కుపుణ్యక్షేత్రములును సందర్శించి, తిరిగివచ్చుచు విలాసవతీపురంబున నొకచేనులో నవయౌవనభాసురాంగియగు నొకయువతిం జూచెను. ఆమెపేరు విమల.

విమల యసమానసౌందర్యోపేత. ఆమెభర్త వ్యవసాయము చేయుచుండును. పొలములోనే ఆ దంపతు లొకయిల్లు కట్టుకొని జీవించుచుండిరి. ఆమె చంద్రసేనునిగాంచి యమందానందభరితస్వాంతయైనది. మార్గాయాసఖిన్నుఁడై యా రాజసూనుఁ డాక్షేత్రములోని గృహమును—గృహప్రాంగణమున సౌందర్యాధిదేవతవోలె నేత్రపర్వమొనరించుచున్న విమలనుగాంచి, సమీపించి "దాహముగానున్నది. కొంచెము జల మిచ్చెదరా?" యని యడిగెను. కమ్మనిపాల నొక రజితపాత్రలోఁబోసి విమల యొయ్యారముగఁ దెచ్చియిచ్చెను. నాథుఁ డింటలేనందున యామె రాకుమారుని లోనికిఁ గొంపోయి, హంసతూలికాతల్పముపైఁ గూర్చుండఁజేసి, సరససల్లాపముల నాతని శ్రమనుబాపి, తనమోహమును బ్రస్ఫుటపఱచెను. కామిని తనంతఁదాను కోరినందున చంద్రసేనుఁ డామెనుఁగూడి భోగజలధితరంగముల నోలలాడుచుండ భర్తవచ్చెను—

"నా ప్రియుఁడా! నీకు భయములేదు. అతఁడు లోనికివచ్చినంతనే యొరనుండి కరవాలము నీవలకుఁదీసి, ఝళిపించి పాఱిపొ" మ్మనెను. అతఁడు లోనికివచ్చినంతనే చంద్రసేనుఁడు ఖడ్గమును గిరగిర నటునిటుత్రిప్పుచు పలాయనమొనరించెను. విమల భయాతిరేకమున గజగజ వణకసాగినది. భర్త నిశ్చేష్టుఁడై కొంతసేపు స్రాన్పడియుండి

యెట్టకేల కొకింతదిట్టతనము వహించి "సతీమణీ! ఈ వీరుఁ డెవరు ? అని యడిగెను—

"ఏమో నాథా! అదేవిధముగాఁ గత్తి త్రిప్పుకొనుచువచ్చి అవసరము వచ్చినపుడు కాని నేను మీకుఁ దలంపునకురాను. తిరుపతి కొండపై నివసించు వేంకటరమణుండను, మ్రొక్కులు మరచినచో నేమి చేయుదునో తెలియునా ?" యని వెడలిపోయినాఁడు.

"అవు నామాట నిజమే. నేను వ్యాధిగ్రస్తుఁడనైనపుడు నీవు మ్రొక్కుకొంటివిగదా! సరే. రేపే తిరుపతికిఁబోయి మ్రొక్కుతీర్చి కొందము" మని పలికెను. "అక్కా! నీ కింతటి సాహసచాతుర్యములు లేవుగదా! అట్టియెడ నీకు జారత్వమనిన నెందులకంత కౌతుకము ?" అని ప్రశ్నించెను. ఆ పలుకులు చిత్తమునకు వచ్చినందున పద్మిని యానాటికి తనప్రయత్నమును విరమించుకొనెను.

# 16 కమలకథ.

—:0:—

పద్మిని యానాఁడు మనసుతీర సుందరముగా నలంకరించుకొని మన్మథసింహునితో సుఖసాగరతరంగడోలికల నూగులాడనెంచి, బయలుదేఱెను. చిలుక ఆమె ప్రయాణసన్నాహములనుగాంచి "అక్కా!" యని పిలిచినది. పద్మినివచ్చి "ఏమి నా రామచిలుకా! ఇప్పటికి సుమారు పదునైదుదివసములనుండి యీ రీతిగా నా యాశ నడియాసఁ జేయుచున్నావు. నేఁడైనఁ బోనీయవా ?" యన్నది.

చిలుక "అదిగో దక్ష్మా! నీ నాథుఁడు గ్రామాంతరములకరిగి యెన్నో రోజులైనది. ఇట్టిసమయమున నతఁడువచ్చి, 'నీ వెచ్చటికిఁ బోయితివే?' యని యడిగిన నేమనిచెప్పఁగలవు? నిన్నతఁ డెంతగా నిందించును. అతనిచేత నేగాక యల్లరిపడినచో నూరివారందరిచేతను కులట యనిపించుకొను టేటి ఘనత? అపకీర్తివచ్చినచో జీవించుటకూడ దుస్తరముగదా! అయినను నేఁడు నేను చెప్పబోవు కమలకథ నాకర్ణించుము. ఇది యత్యద్భుతసంఘటనలతో విలసిల్లుచుండును." అని యీ ప్రకారము చెప్పెను—

తొల్లి చెన్నపురంబును ప్రజాబంధుమహారాజు పాలించుచుండెను. ధార్మికుఁడై యీ రాజకులశేఖరుఁడు ప్రజలను కన్నబిడ్డలభాతి భావించుచుండెను. ఆ రాజవతంసునకు మతిమంతుఁడను మంత్రి కలఁడు. ఆ మంత్రియు, రాజునుకూడ సంతానహీనులై యుండిరి. వారు సంతాపమంది, భయదకాంతారములకుఁబోయి, యుగ్రమగు తపమొనరించిరి. భవానీమాత వారికి సాక్షాత్కరించి మీ యిరువురకునుగూడ సంతానము కల్గునని చెప్పి యంతర్థానమొందెను. రాజుభార్య మంత్రిభార్య గర్భవతులై, నవమాసములుగడచిన యనంతరము శుభముహూర్తమున సంతానము గాంచిరి. రాజునకుఁ బుత్రికయు, మంత్రికిఁ గుమారుఁడు జన్మించిరి. రాజేంద్రు హృదయము వ్యాకులపాటునందెను. మంత్రి యదిగాంచి "ప్రభూ! పుత్రిక కల్గినదనియా మీకీ విచారము. నా తనయుఁడు మీ తనయుఁడుకాఁడా?" యనెను. తన తనూభవకు మంత్రినందనునకుఁ బెండ్లిసేయుటయే యుచితమని యెంచి, రాజు సమాశ్వాసము నొందెను. వారలకు కమలయనియు, ప్రభాకరుఁడనియు నామకరణము గావింపఁబడెను.

శుక్లపక్షసుధాకరులట్లు వారు దినదినప్రవర్థమానులై యొక కంచమునఁ దినుచు, నొకమంచమున శయనించుచుండిరి. కొంతకాల

మిట్లుగడచినది. రాజపుత్త్రిక వివాహోచితవయస్కయగుటచే, నామె జనని "అమ్మా! నీవు పెద్దదానవైనావు. మంత్రికుమారునితో నేపటినుండి మాట్లాడరాదు. ఆతనికి కనబడరాదు. అంతఃపురముననే యుండవలెను. నిన్నే దేశాధీశునకో యిచ్చి పెండ్లిసేయుట నా యాశయ" మనెను.

కమల మనస్సు చివుక్కుమన్నది. వారి బాల్యస్నేహ మప్పటికే యనురాగముగాఁ బరిణమించియున్నది. తనకు నతనికిఁ బెండ్లి యగునని యా సుకుమారి ముచ్చటపడి యెన్నో యాశాసౌధముల నిర్మించుకొన్నది. ఆ గాలిమేడలన్నియు నొక్కసారిగా కూలిపోయినవి. విచారరేఖాంకితవదనయై యా కుసుమకోమలి యుద్యానవనమునకుఁ బోయినది. తనరాకను నిరీక్షించుచుఁ బ్రభాకరుఁడు కూర్చుండియుండెను. తన హృదయము నపహరించిన యా సుందరివదనేందీవరము ముకుళితమైయుంటఁ గని, ప్రభాకరుఁడును పద్మినీవిరహానల సంతప్తుఁడైన ప్రభాకరునిమాడ్కి, విన్నదనమునొంది "కమలా! నేనేమైన యపరాధ మొనరించితినా? నీ వట్లుండగతంబే?" మని ప్రశ్నించెను.

జరిగినదంతయు నామె చెప్పి "నీవే నా మనోనాయకుఁడవని యూశించితిని. నేపటినుండి నిన్ను కలిసికొనక, సంభాషింపక నేను జీవింపనోల్లను. నేటితో మన యిరువురకు ఋణముఁదీరిన" దనెను. అతని హృదయముకూడ నామె పలుకుల నాలకించినంతనే దురంతవిషాదభరితమైనది. "అట్లయినఁ గర్తవ్యమే?" మని యతఁ డడిగెను—

"మనము దేశాంతరమునకుఁ బోవుదమా? సుఖముగా నెచటనైన జీవింతము. నేను వలయుధనముఁ గొనివత్తు" నని కమల పలుక, నయ్యది మిగుల యనుసరణీయముగనుండుటచే ప్రభాకరుఁ డందులకు

నమ్మతించెను. ఆ రాత్రి కమల తనకున్న యమూల్యాభరణములను, ధనమును మూటఁగట్టి, యర్ధరాత్రమున పాణిద్వారమును దెఱచెను. అచట ప్రభాకరుఁడు సుసజ్జితములైన ధవళాశ్వములరెండింటి నాయత్త పఱచి వేచియుండెను. ఇరువురు నా హయముల నారోహించి, శరవేగ మునఁ బరువెత్తించిరి. తెల్లవాఱుసరికి అనేకగ్రామములనుదాటి యొక యరణ్యమును జేరిరి. నిర్జనమైన యా వనాంతరమున వారికొక దేవాల యము కనబడినది. అట నొకింతసేపు విశ్రమించిరి. అందలి ప్రతిమ లనుగాంచి యబ్బురమందిరి. రాకుమారి తాను గొనివచ్చిన యాభరణ ములనెల్లఁ జూపెను. అందులో అమూల్యవజ్రహార మొందున్నది. దానింగాంచి, ప్రభాకరుఁడు మెచ్చుకొని, తనకంఠసీమను గొంతసే పలంకరించుకొని యటుపిమ్మట నా దేవాలయప్రతిమ కంఠమునఁ గీలించెను.

ప్రొద్దు క్రుంకుచుండుటచే కమల "ప్రియా! మనమిందుఁ దడ సినయెడల, నీకాంతారమును దాఁటులోపలనే చీఁకటిపడినచో మార్గము దుర్గమమగు" ననియెను. ప్రభాకరుఁడు లేచెను. ఇరువురును మఱల పయనము సాగించిరి.

"అక్కా! నాకు నిద్రవచ్చుచున్నది. మిగిలినకథ రేపు చెప్ప వచ్చు" నని నిద్రించెను.

# 17 మధురవాణికథ.

-:0:-

మఱునాఁడు పద్మిని పెందలకడనే భుజించి, ముస్తాబై "అక్కా! నిన్నటికథ మిగులరసవంతముగనున్నది. తరువాయిని చెప్పుము. కథను సాంతముగ నాకర్ణించి, మదనశరపీడితుఁడై పోగులు నా మన్మథసింహునికడ కరిగెద" ననెను.

చిలుక యిట్లు చెప్పసాగెను—

"సావధానచిత్తవై వినుము. కమలాప్రభాకరులట్లు ప్రయాణముసల్పి మణిపురమును సమీపించిరి. అయ్యది శ్మశానవాటికయగుట వారొకచో నగ్నిని మాచిరి. వారు సమీపించి యొకవృద్ధవనితను గాంచిరి. ఆమె, భూమ్యాకాశములు మాఱ్ఱ్మ్రోగునట్లు విలపించుచుండెను. "అమ్మా! నీ విట్లు విలపించుటకుఁ గతమే" మని యడుగ నా వృద్ధురాలు "నా కుమార్తె మలిన మృతినొందినది. నా కింక నెవరును దిక్కులేరు. అందుచే నామె చితికడనే యిట్లేడ్చుచున్నా" నన్నది. కమలాప్రభాకరు లామె నూఱడించిరి. సంభాషణవశమున వృద్ధురాలు "అమ్మాయీ! నేను గర్భశోకముచేఁ గ్రుంగియున్నాను. నా కపారమైన భాగ్యమున్నది. మీ రిద్దరును సతీపతులవలెనున్నారు. నా యింటనుండుఁడు. మీకే లోపమునుండదు. నా శోకాగ్నియుఁ జల్లారు" నని బ్రతిమాలినది.

వేశ్యమాత యట్లు బ్రతిమాలినంతనే, కమలాప్రభాకరు లామె కోరిక నిరాకరించలేకపోయిరి. అందులకు సమ్మతించి వారామె యింటికిఁ బోయిరి. ఆమె వారి కేలోపమును దోఁపనీయక కంటికెఱెప్పవోలెఁ

గాచుచుండెను. తన భాగ్యమెల్ల వారి వశముచేసి, యా వేశ్యమాత సకలోపచారములను జేయించుచుండెను. ఒకనాఁడు ప్రభాకరుఁడు "కమలా! ఎంతపోరపాటొనరించితిమి. ఆనాఁడు నీ హారమును నాకంఠమునధరించితినిగదా! ఆ హారమును దేవాలయవిగ్రహము కంఠమున వేసి, మఱచివచ్చితి" యనెను—

"పోనిండు. మన కింకను నెన్నో హారములున్నవిగదా!" యని కమల పలికెను—

"అయినను అమూల్యమైన యా హారము నెందులకుఁ బోఁగొట్టుకొనవలయును. అటకేగి యొక్కక్షణములోఁ దిరిగివత్తును" అని యశ్వము నాయత్తపఱచెను. ఆమెయేగాక, వేశ్యమాతయు వలదని బ్రతిమాలినను "అయ్యో! ఒకగంటలోఁ దిరిగివత్తు" నని యతఁడు శీఘ్రగమనమునఁ బోయెను. వాయువేగమున నా ఘోటకముపైఁ బయనమొనరించి, ప్రభాకరుఁడు కాననమునందలి యాలయముంజేరి, ఆ హారమును దీసికొని, కంఠమునధరించి, బయలుదేఱెను. ఆ హారములో నొకపాము దాఁగికొనియుండి, ప్రభాకరుని కాటువైచెను. వెంటనే విషము శరీరమంతటను వ్యాపించినది. అతఁడు స్మృతిహీనుఁడై సైంధముపై నట్లే పడిపోయినాఁడు.

ఆ అశ్వమును దిన్నగా వచ్చినదారినేపోవుచు మణిపురముఁ జేరెనుగాని, వేశ్యమాత గృహమును గుర్తింపఁజాలక, యాయాసముచే వగర్చుచు వేశ్యవాడలో మరొకవీధిలోనున్న యొక దివ్యహర్మ్యముకడ నాగినది. ఆ సౌధమున మధురవాణియను వారకాంత నివసించుచుండెను. ఆమె వీధిలో నాగియున్న గుఱ్ఱముపైఁ జైతన్యహీనుఁడై పడియున్న సౌందర్యమూర్తినిఁ గాంచి, త్వరితముగ క్రిందికి దిగివచ్చి

లోనికి నౌకరులచేఁ దీసికొనివెళ్ళెను. అశ్వమును సౌధోపరిభాగమునఁ గట్టివేయించి, మేత, నీరు పెట్టించి, యా ప్రభాకరునకుఁ జికిత్సచేయుటకై, ఆమె భిషగ్వరుని రప్పించెను. వైద్యుఁడువచ్చి, హారములోని యురగమునుదీసి మణుల కాటువేయించి, యా విషోరగమును జంపించెను. ఉపచారములుచేయగాఁ బ్రభాకరుఁడు తెలివొందెను. ఆతని జగన్మోహనకరసౌందర్యమునుగాంచి, మధురవాణి విమోహితయైనది. "ఆహా! ఈ నవమోహనాకారుని పొందుఁబడయుని నా జీవితమేల కాల్పనాయని తలంచెను. అతఁడును తన యెదుటనున్న లోకోత్తరలావణ్యవతిని గాంచి, డోలాయమానమానసుఁడాయెను.

ప్రభాకరునకు సకలోపచారములు గావించి, స్వస్థుఁడైనపిదప, మధురవాణి యాతనితోఁగూడి క్రీడాసక్తయై యహర్నిశములు కాలముగడుపుచుండెను. తన ప్రియుఁడు రాకపోవుటచే వేశ్యమాతగృహంబుననున్న కమల విచారావారాశిమగ్నయై పరితపింపసాగెను. వేశ్యమాత యామె నోదార్చి "అమ్మా! నీకు నేను మనసార సాయపడెదను. ఇర్వురమును వెదకి, కనుగొందము" మనెను.

మధురవాణి తల్లి అపరంజికి తన కొమరిత వర్తనమేమియు బోధపడదాయెను. ధనార్జన మొనరింపక, యామె నిరంతరము ప్రభాకరునితోడిదే లోకమని భావించి, మెలంగుచు తనమాట పెడచెవినిఁ బెట్టుటచేఁ జేయునదిలేక, తిన్నగా కాళికాలయమునకుఁబోయి, తలుపులను లోపలబంధించుకొనియెను. నిశావిహారమునకై పోయినసమయమున బంధించుకొనుటచే, భగవతివచ్చి తలుపుఁదట్టెను—

"మాతా! నా కొమరిత మధురవాణికి ప్రభాకరుని రూపమున శనిదేవుఁ డావహించినాఁడు. వానిని వదలఁగొట్టెదనని యభయ

మిచ్చినగాని తలుపులఁ దెఱువననెను. దేవి "అతఁడు నా వరప్రసాద సంజనితుఁడు కావున నే నేవిధమైన యపకారమును జేయను. అతని ప్రభావము, నైశ్వర్యము నీకుఁ దెలియవు" అనెను—

"ఏమైనను సరే—తుదకాతఁడు పరాత్పరుఁడైనను సరే నా యింట నొక్కక్షణమైననుండుట కంగీకరించుదానఁగాను. నీ వేదైన యుపాయముఁ జెప్పినగాని ద్వారకవాటముల నున్ముక్తమొనరింప" నని అపరంజి ఖండితముగాఁ జెప్పినది. అపు డామె యొక దారమును అపరంజి కొసఁగి "దీని నాతని కంఠమునకు హారమువలెఁ గట్టుము. వెంటనే చిలుకగా మారిపోవు" నని నుడివెను. అపరంజి యా పట్టుత్రాడు నందుకొని, తలుపులదెఱచి వెడలిపోయి యా సాయంకాలమే, లేని ప్రేమను కనబఱచుచు ప్రభాకరుని కంఠసీమ కా పట్టుత్రాడును గట్టెను. వెంటనే యతఁడు శుకముగామారి, తుర్రుమని ఎగిరిపోయెను. మధురవాణి "హా ప్రియసఖా!" యని మూర్ఛిల్లెను. శైత్యోపచారములచేఁ దెలివొంది, యా వారవనిత ఏడుపు మానకుండెను.

ప్రభాకరుఁడు తిన్నగా యెగిరిపోయి యా నగరాధీశుని యంతఃపురముపై వ్రాలెను. రాజకొమరిత యా చిలుకనుగాంచి తన కది ముద్దులొలుకుచుఁ గన్పట్టుటచే మెల్లగాఁ బట్టుకొని తండ్రికిఁ జూపించెను."

ఇట్లు చెప్పుసరికి పద్మినికి నిదురవచ్చుటచే "అక్కా! నాకు నిద్ర వచ్చుచున్నది. కావున నిఁక నీవును శయనించుము." అనిచెప్పి, తాను నిద్రించెను.

# 18 మాధవికథ.

-: o :-

పద్మిని యద్భుతముగ సింగారించుకొని, పంజరముకడ కరుదెంచి " అక్కా ! నిన్నటిరేయి చెప్పినకథను సాంతముగ వినిపింపుము. ఇదిగో ! తీయని జామిపండు ! కథవినినపిదప నొక్కక్షణమైన నుండనుసుమా ! తప్పక యా రాజుకడకుఁ బోదును. ఎన్నాళ్ళనుండ యాతని కాశాభంగముఁ గలిగించుచుంటినో నీవే యెఱుఁగుదువుగదా ! " యనెను.

"అట్లేకాని ముందుగా విను" మని యివ్విధమునఁ జెప్ప దొడంగెను—

రాజకుమారి మాధవి యా చిలుకను బెంచుకొందునని చెప్పుటచే యా మహిపురనగరాధిపతి చారుదత్తుఁడు బంగారుపంజరమును జేయించియిచ్చెను. ఆమె యా నాఁటిరాత్రి మల్లెపూలపాన్పుపైఁ బరుండి, తీయనితలఁపులు మనసునుడోలాయమాన మొనర్ప, చిలుకను దీసి ముద్దాడుచు కంఠసీమనున్న పట్టుత్రాడును మెల్లగా తొలఁగించుసరికి, ప్రభాకరుఁడు నిజరూపముతో నామె ప్రక్కఁ గూర్చుండెను—

" ఓహో ! ఏమి యీతని యపూర్వసౌందర్యము. యక్షగంధర్వ కిన్నర కింపురుషాదులలో నొకఁడై యుండవలయును. లేదా, కంత, వసంత, జయంతులలో నొకఁడైన నైయుండవలయును. " అని తలపోసి యతని వృత్తాంతమును సాకల్యముగనెఱింగి, పంచభక్ష్యసహితమైన భోజనము నిడి యతనివలన మన్మథసంగ్రామసౌఖ్యము ననుభవించెను. ఉదయమున పట్టుత్రాడునుగట్టి, చిలుకగామార్చి, రాత్రులందు నిజరూపమును బొందఁజేసి యానందింపుచు మాధవి దినములను నిముషములట్లు గడపసాగెను.

కొలఁదిమాసము లిట్లుగడచెను. మాధవి గర్భవతియయ్యెనని యామె చీరచెఱఁగు పెద్దదగుటచేఁ గనిపెట్టిన చాకలిది వచ్చి రాణితో జెప్పెను. రాణియుఁ దాను దాచియుంచినదో నెట్టికేఁదు వాటిల్లునోయని భర్తతోఁ జెప్పెను. ఆ రాజవతంసుఁడు తన తనూభవను వంచించిన దురాత్మునిని—యవినీతిపరునిఁ గనిపెట్టి బంధింపవలెనని సేవకులకు కఠినముగఁ జెప్పెను. పరిచారికా పరిచారకులు మాధవి మందిరము నొక కంటఁ జూచుచుండిరి. ఆ నాఁటిరాత్రి యా సుందరి చిలుక మెడనున్న దారమును తొలఁగించినది. యథాప్రకారముగ వారు సంభాషించుకొనుచుండిరి. భటు లదివిని "ఓహో! దొంగ నామె తన గదిలోనే దాచియుంచుకొన్నది. ఇంటిదొంగ నీశ్వరుఁడు పట్టలేఁడుగదా!" యనుకొనిరి. వారి గుసగుసలను రాకుమారి మాధవి యాలకించినది—

"నా ప్రాణవల్లభా! కొంప మునిగినది. నీ యునికిని భటులు కనిపెట్టినారు. నేనేమి సేయుదాన! ఉదయముతో మన కిర్వురకు ఋణము చెల్లిపోవు నీవియోగము నే నెట్లు భరించుదాన" నని పలుకఁ ప్రభాకరుఁడు "సఖియా! దైవనిర్ణయ మట్లుండ మానవమాత్రులము మనమేమి చేయఁగలము? ఉదయముననే దారమును నా కంఠమునకుఁ గట్టుము. నేను చిలుకరూపమున నెగిరిపోయెద" ననియెను.

ఉదయమున భటు లామె మందిరద్వారమున నుండిరి. రాజును వచ్చెను. ప్రభాకరుఁడు చిలుకరూపముఁదాల్చి, ఆవ్వ్యమని యంతరిక్షమున కెగిరిపోయెను. రాత్రి యతని పలుకుల స్పష్టముగ నాకర్ణించి యుండుటచే, నా రాజకొమరితను వంచించి, గర్భవతిగ నొనరించిన దుష్టుఁడే యా శుకరూపమున నెగిరిపోయినాఁడని గ్రహించిన భటులలో నొకఁడు పరకాయప్రవేశము నెఱింగినవాఁడగుటచే, డేగరూపము

ధరించి, తటుముకొని పోసాగెను. చిలుక యొకపొదలో నాగెను. డేగ రూపముననున్న భటుఁడటులనే వెదకుచుండెను. రాత్రియగునంత దనుక వార లవ్విధమున గడపివైచిరి.

చిలుక మఱల నెగిరెను. నగరములో నొకవీధిలోని గృహప్రాంగణమున తటాలున కంఠమునందలి త్రాడు తొలఁగించి, నిజరూపము ధరించి ప్రభాకరుఁడా గృహప్రాంగణముననున్న యువతింజూచి "సుందరీ! నన్నొకఁడు తటుముకొని వచ్చుచున్నాడు. వాఁడడిగినయెడల నెవరు నిట్లు రాలేదని చెప్పు" మని యా గృహమునఁ జొచ్చెను. వీధిలో నొకమూల నా యువతినాథుఁడు బహిశ్శంకనివృత్తికై కూర్చుండెను. అతని నామధేయము కేదారశెట్టి. అతఁడు కుంటివాఁడేగాక, గూనివాఁడుకూడనై యుండెను. అతనిభార్య భువనమోహిని. భర్త యెడ ప్రేమానురాగములు లేనిదయ్యుఁ దలిదండ్రులకు భీతిలి యెట్లో కాలము గడుపుచుండెను. ప్రభాకరునిఁ జూచినంతనే యామె హృదయమునఁ గామానలము ప్రజ్వరిల్లసాగెను. ఇంతలో డేగరూపమును విడిచి భటుఁడును నట కరుదెంచి "అమ్మా! ఈ మార్గమున నొక చిలుకకాని, యువకుఁడుకాని వచ్చినారా?" యని యడిగెను. "ఆఁ! వచ్చినాఁడు, కురూపియై యట బహిశ్శంక వంకను గూర్చునియున్నాఁ" డని భర్తను జూపెను. ఆ భటుఁడు కేదారశెట్టి "అయ్యో! నేను గౌరటయ్య యల్లుఁడను. కుంటివాఁడను. నన్నిడ్వకయ్యో!" యని యేడ్చుచున్నను వినక "దుర్మార్గుఁడా! నీ మూలమునఁ బగలంతయు దిండిలేక యెండితినిగదరా! పశువా! నీ కపటనాటకము నిఁకఁ గట్టిపెట్టు" మని రాజభవనమున కీడ్చుకొనిపోయి, కారాగృహమునఁ జేర్చెను.

శనిగ్రహముగాఁ దలచినభర్త వదలెనని యానందభరితాంతః కరణయైయున్న భువనమోహిని యాకలిఁగొనియున్న ప్రభాకరునకు షడ్రసోపేతముగ భోజనమిడి యతనితో సంభోగజలధితరంగముల నోలలాడెను. మఱునాఁటి యుదయమున జగజ్జేగీయమానముగ వెలుగొందు సుందరాకారుని గాంచి "ఇతఁ డెవరమ్మా!" యని తల్లి యడిగెను—

"అమ్మా! నా నోములు నేఁటికి ఫలించినవి. కృపామతియై భగవతి, నా ప్రార్థనల నాలకించి, నా భర్త కీరూపము నొసంగినది. ఎవరికిని యీ రహస్యముఁ జెప్పవల" దని భువనమోహిని సమాధాన మిచ్చినది.

"అక్కా! నాకు నిద్రవచ్చుచున్నది. తరువాయికథ రేపటి దినంబునఁ జెప్పెదవుగాని" యని పద్మిని నిద్రించెను.

---

# 19 కమలప్రభాకరులు కలుసుకొన్న కథ.

—:o:—

మఱుచటిదినము రాత్రి పద్మిని యనంగశరపీడితయై మన్మథసింహుని సంతోషపఱచనెంచి, మేలైన దుస్తులధరించి, ధగద్ధగాయమానములై ప్రకాశించు వజ్రాభరణములు కంఠమునఁ గీలించి, తాంబూల

చర్వణ మొనరించి శుకము నుద్దేశించి "అక్కా! నిన్నటికథను త్వరిత ముగఁ బూరించేయుమమ్మా!" యనెను.

చిలుక యివ్విధమునఁ జెప్పఁగడంగెను—

రాజు కేదారశెట్టిని బిలిపించి "ఓయీ! నీ వృత్తాంతమును బూర్తిగఁ దెల్పు" మన నతఁడు "ఆర్యా! నేను బహిశ్శంకనివృత్తికై వీధిలో నొకమూలఁ గూర్చుండియుంటిని. నాకు సహాయముగ నాభార్య భువనమోహిని మా యింటిగుమ్మములో నిలిచియున్నది. నవమోహ నాంగుఁ డొకడువచ్చి "నన్నుగూర్చి యెవ్వరైన యడిగినచో నీ మార్గ మున రానేలేదని చెప్పు" మని తాను మా యింటఁజొచ్చెను.

వెంటనే మఱొకడువచ్చి "ఈ మార్గమున నెవరైనవచ్చినారా?" యని యడుగ, నా సతి "అదుగో! అటఁ గూర్చున్నాఁ" డని నన్ను చూపినది. నేను కా నయ్యోయని మొఱపెట్టుకొన్నను యీ భటుఁడు వినక నన్నీడ్చుకొని వచ్చి యంధకారబంధురమైన కారాగారమునఁ బడవైచినాఁడు." అని చెప్పెను. అతనిని కారాగారమునఁగాక వేరొక చోనుంచి యాదరించుటకై యాజ్ఞయిచ్చి రాజు కేదారిశెట్టి మామ యగు గెరటయ్యకుఁ గబురంపెను—

ఇట నిట్లుండఁగా ప్రియునిజాడ తెలియనికారణమున కమల నిరాశోపహతయై, ప్రాణత్యాగముచేయుటకు సిద్ధపడెను. వేశ్యమాత యామెను వారించి, ప్రసిద్ధుఁడైన యొకజ్యోతిష్కునికడకుఁ గొంపో యెను. ఆతఁడు కమల హస్తరేఖల పరిశీలించి, జాతకమును జూచి "అమ్మా! నీ ప్రియునికై యాందోళితమనస్కవై కడుంగడు పరిత పించుచున్నావు. నిరాశనొంది యాత్మహత్యకుఁగూడ పాల్పడుచున్నావు.

నీ వధైర్యము నొందకుము. నీ ప్రియసఖుఁడు నిన్ను కొలఁదిదివసములలోఁ గలిసికొనఁగల " డని పలికెను. కమల ధైర్యమూని తన యిష్టదైవము నహర్నిశములు ప్రియాగమనకాంక్షియై ప్రార్థించుచుండెను.

గెరటయ్య రాజునొద్ద కేగెను. " ఏమోయిశెట్టీ ! నీ యల్లుఁడు వజ్రముల నాణెముఁజేయుటలో నపరిమిత ప్రజ్ఞాధురంధరుఁడని వింటిమి. అతని నొకసారి యిటకుఁ గొనివత్తువా " యని యడిగెను.

" ప్రభూ ! మీతో నా యల్లునిగూర్చి యీ విధముగఁ జెప్పినవా రసమాన ప్రజ్ఞాధురంధరులుకాని నా యల్లుఁడుకాఁడు. అతఁడు కుంటివాఁడు. అంతేకాదు గూనివాఁడుకూడ. అతనిని చూచుటయే మీ యభిప్రాయమైనయెడల నిపుడే గొనివచ్చెద " ననెను. రాజు తీసుకొనిరమ్మని చెప్పుటచే గెరటయ్య యింటికిఁబోయి, యసాధారణ సౌందర్యోద్దీపితుఁడై భాసిల్లుచున్న ప్రభాకరునిఁగాంచి " మనయల్లుఁ డేఁడీ ? " యనెను. వారు " అమ్మాయి ప్రార్థనల నాలకించి, యంబ యీ రూపమును మన కేదారానికిఁ బ్రసాదించిన " దనిరి. అతఁ డది నమ్మి తనతో రాజస్థానమునకుఁ బ్రభాకరుని రమ్మనెను. భువనమోహిని వలదనివారించెను. " అమ్మో ! రాజాజ్ఞను దిరస్కరించుట క్షేమమగునా ? ఇప్పుడే తిరిగివచ్చెద " నని ప్రభాకరుఁడు వెడలెను—

తాను ప్రభాకరునేఁగాని యన్యునిఁ బెండ్లియాడనని రాజకుమారి మాధవి తలిదండ్రులతో నిష్కర్షగఁ జెప్పి, తా నతనికొరకై బెంగగొనియుండెను. ప్రభాకరుఁడు రాఁగానే రాజు గౌరవించి, కుమార్తెకుఁ గబురంపి, చూపించెను— " నాయనా ! ఈ సుందరాంగుఁడే నీ యల్లుఁ " డని యామె పలికెను. ప్రభాకరుఁడు తానుఁ రాకొమరిత కమలయు బయలుదేఱివచ్చిన వృత్తాంతమెల్ల రాజునకుఁ దెలిపెను.

కేదారశెట్టినిఁ జూపి రాజు "ఏమోయి గెరటయ్యా! నీ యల్లుఁడని యాతనిం గొనివచ్చితివికదా! మఱి యీతఁ డెవ? రని ప్రశ్నించెను—

"ప్రభూ! ఇతఁడే నా యల్లుఁడు, ఇంటిదగ్గర గూఁడువాం డ్రట్లు చెప్పినారు. నా కిదియంతయు నగమ్యగోచరముగ నున్న" దని గెరటయ్య బదులు పలికెను. రాజు వేశ్యమాత యింటనున్న కమలను, మధురవాణినిగూడ రప్పించెను. శుభదినంబున మాధవీ కమలాప్రభా కరులకును, మధురవాణికిని వివాహములు జరిగెను. రెండుమాసము లటనుండి, మామగారివలన ననేకములైన బహుమానములనంది, ప్రభాకరుఁడు చెన్నపురంబునకుఁ బోయెను. ప్రజాబంధుమహారాజు కమలాప్రభాకరులఁగాంచి యానందవివశుఁడై ప్రభాకరుని పట్టాభి షిక్తు నొనరించెను.

శుకము కథను ముగించునరి కర్ధరాత్రమగుటచే, పద్మిని హాయిగ నిదురించినది.

# 20 హేమలతకథ

-: o :-

పద్మిని జరీచీర ధరించినది. పట్టురైకతొడిగి, ఒక్కచంద్రహా రమునే కంఠమున ధరించి, లలితముగ సింగారించుకొని, భోజనమొన రించి "అక్కా! నేఁటికిఁ గథయుగిథయు వలదు. ఆతనికిఁ గోపము

వచ్చునేమో ! నేఁ డేగివచ్చెద" నన, కీర "మయ్యో ! నీకుఁ దెల్పుటకై విచిత్రఘటనవిలసితమైన హేమలతకథను నాలోచించియుండ, నీ విట్లు నా కాశాభంగ మొదవించుట న్యాయమగునా ? అందుచేతనే విజ్ఞులు అగాధసముద్రము లోతైన నరయనగుఁగాని, నారీహృదయము నెఱుంగవశము కాదనిరి. ఎంతటికఠినురాలవే అక్కా !" యనెను—

పద్మిని మందహాస మొనరించి "అక్కా ! అంతకోపమేల నమ్మా ! ఆ హేమలతకథ చెప్పినపిమ్మటనైనఁ బోనిచ్చెదవా, లేదా?" యని పృచ్ఛఁ జేసినది. అటులనేఁ బోనిత్తునని చిలుక యివ్విధమునఁ జెప్పసాగెను—

"తొల్లి కాంచీపురంబును బిందువర్ధనుఁడను ఱేఁడు పాలించుచుండెను. ఆ భూపతి చిరకాలము సంతానహీనుఁడై యుండెను. అతని భార్య విశాలాక్షి గౌరీవ్రతము నాచరించి, పెక్కుదానధర్మములఁ జేసెను. ఆమె గర్భవతియై, నవమాసములు గడచినపిదప, తేజోరాశి యగు పుత్రికను గాంచెను. వారామెకు హేమలతయని నామకరణ మొనరించి, యతిగారాబమునఁ బెంచుకొనుచుండిరి. హేమలత దినదిన ప్రవర్ధమానయై, నవయౌవనోన్మేషయై వెలుఁగొందుచుండెను.

తనూజకు వివాహము సేయనెంచి, బిందువర్ధనుఁడు వివిధదేశాధీశుల యువరాజకుమారుల చిత్రపటములఁ దెప్పించెను. ఏ రాజకుమారుని చిత్రమును హేమలతకు నచ్చదాయెను. రాజు కర్తవ్యవిమూఢుఁడై నిజామాత్యవరేణ్యునకుఁ దెలిపెను. అతఁడు పౌరోహితుని బిలిపించి, హేమలత చిత్తరువునిచ్చి, దేశములన్నియుఁ దిరిగి యా సుకుమారికిఁ దగిన వరుని జూడుమని పంపెను. ఆ భూసురుఁడును పెక్కుదేశములు దిరిగితిరిగి యా జగదేకసౌందర్యవతికిఁ దగిన

వరునికానక నిరాశుఁడై తిరిగివచ్చుచు నొక గ్రామమున ధర్మశాలలో, బసచేసెను. అదే సమయమున కోసలదేశాధీశుఁడైన విజయవర్మ మహీపాలుని కుమారునికై తగినకన్య నన్వేషించుచు బయలుదేఱిన బ్రాహ్మణులు నటకే యరుదెంచిరి. కాంచీపుర బ్రాహ్మణుఁడును వారును కుశల ప్రశ్నాదికమైనపిదపఁ దమతమ కార్యములఁ దెలుపుకొనిరి. బ్రాహ్మణుఁడు హేమలత చిత్రమును వారికిఁజూపెను. ఆ ద్విజన్ములును తమ కడనున్న రాకొమరుని పటముచూపిరి. ఆ రాజసూనునిపేరు రామవర్మ. ఆ యిరువురును ఒకరినిమించిన సౌందర్య మొకరు కల్గియుండిరి. ఇరువురకు నీడు జోడు తగియున్నవని యా భూసురులు నిశ్చయించుకొనిరి. కాంచీపుర బ్రాహ్మణుండు హేమలత చిత్రమును వారికిచ్చి తాను రామవర్మ చిత్రమును కాంచీపురంబునకుఁ గొంపోయి మహారాజునకుఁ జూపెను. హేమలత యా చిత్తరువును దిలకించి, యా రాకొమరుఁడు తనకు నచ్చినాఁడని తెల్పినది. అన్నాళ్ళకు తన తనయ యంగీకారమును విన్నందులకు నిరతిశయానందభరితాంతఃకరణుఁడై కోసలదేశాధీశునకుఁ గబురంపించి, శుభముహూర్తము నిశ్చయింపించెను.

హేమలతా రామవర్మలకు మహావైభవమున వివాహము జరిగినది. రామవర్మ శ్వశ్రుగృహమున మూడుమాసములుండి, బిందువర్థనునిచే యనర్ఘములైన కానుకలనంది, హేమలతను కోసలదేశమునకు సపరివారముగ బయలుదేఱెను. మార్గమధ్యమున వారొక భీకరారణ్యమునుండి పోవలసివచ్చెను. వారు చాలసేపు ప్రయాణమొనరించి, మార్గాయాసం బధికమగుటచే నొకచోట గుడారములు వైచుకొని విశ్రమించిరి. హేమలత గుడారములో శయనించియుండ, రామవర్మ ఖడ్గధారియై యావల శయనించెను. వెన్నెల మనోహరముగఁ గాయుచుండెను. గగనమార్గమున నైదుగురు దేవకాంతలుపోవుచు, క్రింద

వెలుఁగువలె శాన్పించుటచే నది యేమో చూడవలెనని వచ్చిరి. అను
పమానసౌందర్యోపేతుఁడైన రామవర్మను గాంచి, యా యమరాంగ
నలు "ఆహా! ఈతఁ డెవరో సుమశరునిమించిన యందముతో నొప్పు
చున్నాడు. నిత్యయౌవనవతులమయ్యు, యీ నవలావణ్యతారుణ్య
సంశోభితుని కూరిమిబడయని మన యౌవనములు నిరర్థకములుకావే—
ఈతనిని మనలోకమునకుఁ గొంపోయి రోజున కొకరమువంతున క్రీడిం
త" మని తలపోసి, మంత్రాక్షరముల నుచ్చరించి, యతనికి మెలఁకువ
రాకుండఁ జేసిరి. వారు రామవర్మ నెత్తికొని వ్యోమమార్గమున కెగిరిపోయి,
తమలోకమును జేరిరి. ఒకదేవతయింట నతఁడు శయనించెను. ఉదయ
మున వారు స్నానార్థము కొలను కరిగిరి. రామవర్మ మేల్కాంచి,
తన భార్యనుగానక "ఏమి యీ చిత్రము? ఆ యడవిలో గుడార
ములు ఏమైనవి? నా భార్య ఏమైన?" దని కళవళపాటు జెందియున్న
సమయమున నా యచ్చరలేమ యరుదెంచెను. యతిలోకరమణీయ
మోహనమూర్తినిగాంచి యతఁడు సంభ్రమచకితుఁడాయెను. "రాకు
మారా! నీ విపుడు మహేంద్రునిచేఁ బాలింపఁబడు స్వర్గలోకమున
నున్నాఁడవు. మే మైదుగు రప్సరఃకాంతలము భూలోకసంచార మొన
రించుచు, దేదీప్యమానమై తేజరిల్లు నీ సౌందర్యమును వీక్షించి, విమో
హితలమై యిటకుఁ గొనివచ్చితి" మని—షడ్రసోపేతమగు భోజన
మిడి జరాభయము లేకుండున ట్లమృతముఁ ద్రావించి, హాయిగొలుపు
పాటలఁ బాడి క్రీడాసౌఖ్యము నందెను.

దినమునకొకరువంతున నయ్యచ్చరమచ్చెకంటులు రామవర్మతో
సౌఖ్యార్ణవమున నీదులాడుచుండిరి. ఉదయమున హేమలత నిద్రనుండి
మేల్కాంచి, నిజేశునికానక యాందోళితహృదయమై విలపింపసాగెను.
పరివారములోనివారును, కూడావచ్చిన యమాత్యుఁడు నూరడించినను

ఆమె వినక ఏ క్రూరమృగమో తనపాట్టను బెట్టుకొనియుండునని భీతిలి తానును మృతినొందం సంకల్పించుకొనెను. మంత్రి వలదనివారించి, ధైర్యముగొలిపి "అమ్మా! మనము అయోధ్యాపురమును సమీపించినారము. నీనాథుఁడు వన్యమృగములవాతఁ బడెననుట కల్ల. ఏ మృగమునో వెంటాడియుండును. ఆ రాకుమారునకు భయములేదు. తప్పక అయోధ్యాపురమునకు రాఁగలఁడు. అంతవఱకు నీవు శ్వశ్రూగృహంబుననే యుండుట శ్రేయస్కరమమ్మా!" యని వారు నచ్చచెప్పిరి—

"అయ్యో! నానాథుఁడులేకుండ నే నత్తవారింటి కెట్లుపోవుదును." అని యామె సంశయించియు, యందఱును చెప్పినదానికి వ్యతిరేకముగఁ బ్రవర్తించుట యుక్తముకాదని అయోధ్యాపురమునకుఁ బోయెను. అత్తమామ లామె నాదరించి, రామవర్మను వెదకికొనివచ్చుటకై పెక్కుమంది చారులను నియమించిరి.

దేవలోకములో రామవర్మ యా దేవకాంతలతోఁగూడి యానందముపొందుచు, యవధిని గాంచుచుండఁగా ఒకనాఁ డతనికి తన హృదయేశ్వరి జ్ఞప్తికివచ్చెను. వెనువెంటనే అతని వదనము విన్నఁదనము నొందెను. అతఁడు ఆ దేవకాంతలతో మనసిచ్చి మాట్లాడక—త్రిలోకసమ్మోహనకరమైన వారి గానమును లెక్కసేయక వారల కులుకుతళుకులకు బెదరకుండుటనుగాంచి, యా దేవకామినులు "అయ్యో! ఇన్నాళ్ళను దరహాసితవదనారవిందుఁడై మనకు నిరవధికానంద మొసఁగూర్చిన యీ రాకొమరుఁడు నేఁడేల విన్నదనము నొందియున్నాఁడని వారిలోవారు తర్కించుకొని యాతనినే "ఓ మనోనాయకా! మాడెందముల కమందానందసంధాయకుఁడవై మెలఁగిన నీవు నేఁడేల విషాదాంకితవదనుఁడవై యున్నా?" వని యడిగిరి.

"ప్రియసఖులారా ! మీ యాదరణలో నెట్టిలోపమును లేదు. నా సతి నానాఁ డరణ్యమున నుంచి వచ్చినానే. ఆమె యేమైనదో గదా ! యని శంకాసంకలితస్వాంతుఁడనై వ్యస్తచిత్తుఁడనై యుంటి" ననియెను.

"అట్లయిన నొక పనిచేయుము. మేము మంగళవారమునాఁడు మహేంద్రునిసభలో నాట్యముచేయుటకై పోవుచుందుము. ఆ నాఁడు నీ కొక మందారసుమమాల నిచ్చెదము. ఆ మాలను ధరించినంతనే నీవు పక్షివలె రెక్కలుకలవాఁడవై యెగిరిపోదువు. ఆమెనుజూచి, తెల్లవారుటకుముందే తిరిగిరమ్ము. రాక మమ్ము వంచించితివా నీకు భయంకరమైన శాపము నొసంగుదు" మనిరి.

మంగళవారమునాఁటి రాత్రి యా రాజనందనుఁడు మందారపుష్పదామధారియై, అయోధ్యాపురమున నిజాంతఃపుర సౌధముపై వ్రాలెను. పరిచారకులందఱు నిద్రించుచుండిరి. శయ్యాగారమున హేమలత నిద్రించుచుండెను. తనకై బెంగగొనియుంటచేఁ గాబోలామె వన్నెదొఱంగియుండెను. ఆమెనుజూచి నిద్రాభంగ మొనర్చినచో నేడ్చునని సంశయించి, యటనున్న పన్నీరునుజల్లి-గంధమును చెక్కుళులకుఁ బూసి, ముద్దిడుకొని, వెడలిపోయెను. దేవకాంతలతో నతఁడు జరిగినదెల్ల తెలిపి, వారి కానంద మొనఁగూర్చెను. "అయ్యో! ఆమెను చూచి వచ్చుటేమి ? సంతోషముగ నామెతో భోగ మనుభవించిరాలేక పోయితివా" యనిరి. మఱల మంగళవారమునాఁడు రామవర్మ అయోధ్యపురమున కరిగెను.

హేమలత యా మఱునాఁటి యుదయమున తనముఖము నలవాటు ప్రకార మద్దమునఁ జూచికొని, చెక్కులపైనున్న గంధమును

జూచి " ఇదియేమి? ఎవరు వ్రాసియుందు " రని యనుదినము మెలఁకువగనుండెను. మంగళవారమునాఁటిరాత్రి రామవర్మవచ్చి యామందారమాలనుదీసి, వేఱొకచోనుంచి, శయ్యపైఁ గూర్చుండెను. హేమలత మేల్కాంచి, నిజనాథునిఁ గని " నాథా! మీ కిది న్యాయమా! నట్టడవిని విడిచి యేండేగితి?" రని యేడ్చెను. జరిగినదంతయు నతఁడామెకుఁ బూసగ్రుచ్చినట్లు తెలిపి మన్నింపుమని బ్రతిమాలి, ప్రతి మంగళవారమును వచ్చుచుందుననియుఁ గొంతకాల మీ విషయము రహస్యముగ నుంచుమనియుఁ బలికి, యామెతో మన్మథక్రీడల నానందించి, వేకువఝామున వెడలిపోయెను.

రామవర్మ దేవలోకము చేరెను. అతని ముఖాంబుజము వికసించియుండుటచే యచ్చరకామినులు మహానందభరితాత్మలైరి. ఈ విధముగా నాలుమాసములు గడచెను. హేమలత చీర కట్టుకొనుట పెద్దదగుటను గమనించి, చాకిత బిందుధరుని సతియగు మహారాణితోఁ జెప్పెను. మహారాణి భర్తతోఁ జెప్పెను. " భర్త గ్రామమునలేక యెటకో యరిగి పెక్కుమాసములైయుండ, నీమె గర్భవతియగుట వారి కనుమానకారణమై, బాలానిఁ జంపించుట మహాపాతకము కావున నరణ్యమున విడిచిపెట్టుట యుచిత" మని యెంచి భటులతో నట్లొనరింపవలెనని చెప్పెను.

రాజాజ్ఞ యామెకుఁ దెలిసెను—అయ్యో! తన నాథుఁడు రహస్యముగ నుంచుమనుటచేత నేగదా, తాను వారి కతనిరాకనుగూర్చి చెప్పక యూరకున్నది? దైన్యముతో నిండిన హృదయముతో నామె యేమి జరుగునాయని వేచియుండెను. నాటి యర్ధరాత్రమున భటులు వచ్చి రాజాజ్ఞ నెఱిఁగించిరి. విధిలేక యామె వారి ననుసరించి,

యా కాంతారమునకుఁ బోయెను. ఆమె నట నిడిచి వారు పురమునకుఁ బోయినంతనే, తన దురదృష్టమును నిందించుకొనుచు, భూమ్యాకాశములు ప్రతిధ్వనించున ట్లెలుగెత్తి యేడ్చుచు ఏ క్రూరమృగమైనవచ్చి తన్ను జంపినై దినను బాగుండునని యెంచెను. కంటకాన్వితపథములఁ గ్రుమ్మరుచు నా సుకుమారి రేయెల్ల నడిచి, యాయాసభరమున నొక చో పడిపోయెను.

మృగయా వినోదార్థమై కాంచీపురాధీశుని సేనానాయకుఁడా యరణ్యమునకు వచ్చి, నిస్సహాయయై పడియున్న యామెను దిలకించి, యామెకు శీతలోపచారములనుజేసి, మూర్ఛనుండి తేరుకొన్నపిదప నామె యుదంతము నెఱింగి "అయ్యో! తల్లీ! ఎంత దుస్థితి సంభవించినది. ఆగర్భశ్రీమంతురాలవైన నీవు ఎంతటి దుర్భర దుస్సహాకష్టముల ననుభవించితివమ్మా! నిరాశపడకుము. నేను మీ సేనానాయకుఁడను. మీ జనకుని యింటికిఁ బోవుద" మని నచ్చఁజెప్పి, యామెను కాంచీపురమునకుఁ గొంపోయెను. తలిదండ్రు లామె యుదంతము నెఱింగి ఎంతో విచారించి, యామె నోదార్చి "అమ్మా! నీవు చింతఁదక్కియుండుము. నీ కేమియు భయములేదు. నీ నాథుఁ డిచటికే వచ్చి నిన్ను కలిసికొనఁగలడు" అనిరి.

తొమ్మిదిమాసములును గడచినది. శుభదివసమున నామె కోటి సూర్యప్రభాభాసమానుఁడైన యొక మగశిశువును గాంచెను. వాడుక ప్రకారము రామవర్మ దేవలోకమునుండివచ్చి, తన భార్యనుగానక విచారక్రాంతహృదయుఁడై వెడలిపోయెను. ఈతని విన్నదనమును గమనించి యా యచ్చరలేమలు "ప్రియా! అట్లుంటివేమి? నీ సతి నీతో మనసిచ్చి మాట్లాడలేదా?" యని యడిగిరి. అతఁ డామె కనబడలేదనెను. రెండుసంవత్సరములు గడచిపోయెను. అతనికి హేమ

లత యేమైనదా, యెందులకుఁ గాన్పించలేదాయని సంశయముతోఁ జెను. అతని చిత్తము దురంతవిషాదానలతప్తమైనది. అతని స్థితిం జూచి యా యప్సరఃకాంతలు భార్యకొఱకై యాందోళనాయత్తచిత్తుఁడై యున్నాఁడని యూహించి, దివ్యదృష్టివలన నామెక్షేమసమాచారముల నెఱింగి "హృదయాధినాథా! నీ ప్రేయసినిగూర్చియా డోలాయమానమానసుఁడవై యుంటివి? ఆమె తన తలిదండ్రులకడ క్షేమముగ నున్నది. నీవేగి యామెను జూచిర" మ్మనిరి.

అతఁడు మందాపూలదండనుధరించి, కాంచీపురమునకుఁబోయి భార్యను జూచెను. ఆమె నిజనాథునిం గని విచారబాష్పాకులనయన యయ్యెను. భార్య నూరడించి, తన పుత్రునిం గని నిర్భరానందవివశుఁడాయెను. "నాథా! ఎన్నాళ్ళీ వియోగానలమునఁబడి మ్రగ్గిపోవలయును? నాకా యప్రతిష్ట సంభవించె నది యెట్లు తొలఁగు," నని ప్రతిమాల నా రామవర్మ "కుసుమకోమలీ! నే నెట్లయినఁ బ్రయత్నించి యా దేవకామినుల నిటకుఁ గొనివత్తును. వారిని వివిధముల గౌరవించి, నీవే యడుగుము. వారికి కనికారముకల్గి నన్ను వదలివైతు" రని పలికి, ప్రభాతమువరకుఁ బూర్వమే వెడలిపోయెను. ఆనందమున వికసించిన యతనిమోమును గని, యా దేవకాంతలు "ఓహో! ప్రియుఁడా! నీ వదనాంబుజము మనోహరముగ వికసించియున్నది. నీ భార్యయాకంతె సౌందర్యవతియా" యని వారు ప్రశ్నింప, నతఁడు "సుందరీమణులారా! మీ యపూర్వసౌందర్యమునకు మర్త్యులయందు మేపాటి. అది కాదు. ఆమె నా యర్ధాంగి, మర్త్యులమగుట మా సంబంధపాశము దృఢతమము. అమరులగుట మీకును నాకును గల ప్రేమ ప్రబలమై యొప్పినను, యయ్యది చిరకాలముండునది కా" దనెను—

ఒక రమణి "అట్లయినఁ బ్రియుఁడా! నీ సతి నానాఁడు మేము చూడనేలేదు. మా కొకసారి చూపింతువా?" యనెను—

"అందుల కభ్యంతరమేమి? ఎపుడు వచ్చెదరు. ఆమెయు మిమ్ముఁజూడ నభిలషించుచున్న" దని యతఁడు పల్కెను.

"మంగళవారమునాఁడు వచ్చెదము. నీవు త్వరపే యామెకడకుఁ బోయి, మా రాకనుగూర్చి తెలుపు" మనిరి.

అతని యానందమునకు పారము వేదు. ఆతఁడు మఱునాఁటిరాత్రి కాంచీపురమునకుఁ బోయి, నిజసతీలలామకు వారి రాకనుగూర్చి చెప్పెను. మంగళవారమునాఁటిరాత్రి యా యప్సరాంగన లరుదెంచి నంతనే వారిని పూజించి, గౌరవించి బంగారుపళ్ళెరములందు వివిధము లైన పిండివంటలతోఁగూడిన భోజనమిడెను. ఆమె యద్వితీయసౌందర్య సౌకుమార్యములగాంచి,యబ్బురమంది యానారీమణులు, హేమలతకుఁ దాము గొనివచ్చిన యమృతమునొసంగి, బిడ్డ నెత్తుకొని, చాలసేపు సంభాషించి "నీ కేదైన వరము నీయవలెనని యున్నది. కోరుకొను" మనిరి.

"అక్కలారా! అమరులదర్శనమే బహుదుర్లభమైనది. నా ఆతిథ్య మంగీకరించినందున, నా జన్మమే ధన్యతఁగాంచినది. మీరు అడుగుమన్నారుకనుక కోరుచున్నాను. నా నాథునితోడి వియోగమె న్నాళ్లు భరింతును? పుట్టినింటనేయున్నచో పడతికి గౌరవముండునా? నా ప్రాణేశ్వరుని నాకు దయసేయుఁడు" అనెను.

వారు దయార్ద్రహృదయులై "చెల్లెలా! నీ భాగ్యమేమోగాని, త్రిజగన్మోహనాకారుఁడైన పతిని బడసితివి. మా కీతనియం దవ్యా జానురాగ ముదయించినది. నీ వలెనే మేమును యీతనిని విడిచి మనఁ జాలము. కావున నొకపనిచేయుదము. ఈతనిని ప్రతిమంగళవారమును

మా కడ కంపుము. మిగిలిన దినములందు నీవు సుఖింపు" మని యామె కెన్నో బహుమానములనిచ్చి వెడలిపోయిరి.

ఆమె తన హృదయేశుని రాకనుగూర్చి, తలిదండ్రులకు తెలిపెను. వారు రామవర్మను జూచి, బ్రహ్మానందభరితాత్ములైరి. అట కొన్నాళ్ళుండి మామగారిచే పెక్కుబహుమానములంది, రామవర్మ భార్యాసమేతముగ కాంచీపురమునకు వచ్చి తలిదండ్రుల కానందము కలిగించి, జరిగినదంతా చెప్పి వారి కనుమాన నివృత్తి కలిగించెను. తాము పొరపడితిమని యత్తమామలు మిగులపశ్చాత్తాప మందిరి. రామవర్మ అయోధ్యాపురాధిపతియై సతీసుతులతోఁ బ్రజాహితము నాకాంక్షించు రాజ్యపాలనము చేయగడంగెను.

కథను ముగించుసరి కర్ధరాత్రము మీఱినందున, పద్మిని మాఱు మాటాడకుండ నిద్రించెను.

# 21 మంజుభాషిణిక

-: o :-

నాఁటిరాత్రి మన్మథసింహుని పరిచారిక మంజరి యరుదెంచి "పద్మినీ! ఏమమ్మా! రాజాధిరాజై, దేశము నేకచ్ఛత్రాధిపత్యమున బాలించుచున్న మన్మథసింహుని యీానడించుట నీకుఁ దగునా? ఎన్నాళ్ళనుండి, నీ యెడ విమోహితుఁడై యా రాజచంద్రుఁడు పలవించు

చున్నాఁడు ? ఇప్పుడు నాతో ర ” మ్మని పలుక పద్మిని యటులనే వత్తునని భోజన మొనరించి, యనన్యసామాన్యముగ నలంకరించుకొని రాజాంతఃపురమునకు బయలుదేఱి, శుకముకడ కరుదెంచి, “ అక్కా ! నేఁడు నన్ను క్షమింపవా ? రాజు నా యందు గాఢానురాగబద్ధుఁడై యున్నాఁడనుటకు నిదర్శనము చూచితివా. మంజరి నంపినాఁడు ” అన్నది—

“ ఓహో ! అటులనా ! మంజరీ ! నిజముగ రాజు కీమెపైఁ బ్రేమగలదేని యతఁడేల తన భార్యను బరిత్యజింపరాదు ? అపు డీమె తనభర్తను వదలి, తానే రాణియై యుండుగదా ! ” యని కీరము వచింప మంజరి “ నిజమే. రాజు కాముకవికారపీడితుఁడై యీామెను గొనిరమ్మనినాఁడేగాని యర్ధాంగిని విడిచిపుచ్చునా ? యనెను.

“ న్యాయమును బ్రజల కనుగ్రహించి, యన్యాయమెచటను జరుగకుండ చూడవలసిన రాజు తానే యన్యాయాధర్మములకుఁ బాలు పడుచుండ, ప్రజలు ధర్మమునకు బద్ధులై యుందురా ? పోనిమ్ము. ఈమెనుగోరు ఆ నృపాలుఁడు తన సతీమణి నీమె భర్తకడ కంపునా ? తన యర్ధాంగి సేనావరిరక్షితంబగు దుర్గంబున, ననూర్యంపశ్యయై యుండవలయునా ? తాను కంటికింపుగఁ గాన్పించిన పరసతిని గవయఁ గోరునా ? సరే. మీా యిష్టముకాని నా కాకలి యగుచున్నది. ఆహార మిడి, నేను నేఁడు చెప్పబోవు మంజుభాషిణికథ నాకర్ణించినయనంతరము వెడలుఁడు లేకున్నమానుఁ ” డనెను.

పద్మిని చిలుక కాహారమిడినపిదప, నీ విధముగా మంజుభాషిణి కథ చెప్పసాగెను—

తొల్లి కౌముదీదేశమును కీర్తిమంతుఁడను ఱేఁడు పాలింపుచుం డెను. అతనికి సంతానము లేకపోవుటచే సంతానములేనివానికి గతులు లేవను భయంబు డెంద౦బును డిందుపఱువ, ననేకదానధర్మముల నొన రించెను. భార్యచే వ్రతముల నాచరింపఁజేసెను. ఇట్లుండఁగా వారి యింటికొక సన్యాసి వచ్చెను. ఆ జడదారి నాదరించి, గౌరవించి తమకు సంతానము లభించునట్లొక వర మనుగ్రహింపుమని వేడిరి. వారి యారాటమునుగాంచి, దయార్ద్రహృదయుఁడై యా సన్యాసి యొక మంత్రోపదేశము గావించి "నీకు నలువురు కుమారులు జన్మింతురు. వారిలో నే నెవనిం గోరుకొందునో వాని నా కేయభ్యంతరమునుజెప్పక యీయవలె" ననెను—

అందులకు నృపాలుఁడు సమ్మతించి, యా యోగి యుపదేశించిన మంత్రమును సతీసమేతుఁడై జపించెను. కొన్నాళ్లకారాణి గర్భవతి యయ్యెను. నెలలు గడచినపిదప నొక శిశువును గాంచెను. తదుపరి ముగ్గురుసుతులు జన్మించిరి. ఆ తనూభవులఁ గాంచి, యనూనానంద భరితహృదయుఁడై రాజు వారల విద్యాధికులుగనేగాక యస్త్రశస్త్ర ప్రయోగకుశలురుగఁ జేసెను. వారు నల్వురు నవయావనోద్భాసితులై పూవిలుకానిమించు సౌందర్యము గలిగియుండిరి. ఇంతలో సన్యాసి యరుదెంచి "ఏమి రాజేంద్రా! ఆనాఁడు వాగ్దానము చేసినప్రకా రము నీ కుమారునిఁ బంపెదవా, లేదా?" యని యడిగెను.

"చిత్తము స్వామీ!" యని యంతఃపురములోనికిఁ బోయి భార్య కా సమాచారము నెఱిఁగించుసరి కామె గొల్లుమనెను. ఎవరి నిచ్చుటకును నామెకు మనస్కరింపదయ్యెను. ఆమె విచారమునుగని పెద్దకొడుకు తా నేగుదునని సంసిద్ధుఁడయ్యెను. "అయ్యో! నాయనా!

జ్యేష్ఠుఁడవగుట రాజ్యమునకు యువరాజువై, నా యనంతరము దేశము నేలఁగల నిన్నెట్లు విడుతురా ? ” యనెను. కనిష్ఠపుత్త్రుఁడు నేను వెడలెదనని బయలుదేఱ “ నా చిట్టితండ్రీ ! కడఁగొట్టువాఁడవు నినువదలి నే నెట్లు జీవింతురా ? ” యని తల్లి యేడ్చెను.

రెండవ కుమారుఁడు తా నేగుదు ననెను. వారు వలదనినను యతఁడు వినక, సన్న్యాసి ననుసరించి, చనెను. ఆ జడదారి ఘూకసూకరహర్యక్షాది క్రూరమృగాకులమైన విపినాంతరమునకుఁ గొంపోయి “ రాకుమారా ! నీ నామధేయ మెయ్యది ? ” యనెను—

“ సోమశేఖరుఁడు ! ” అని యా యువకుఁడు సమాధాన మిచ్చెను.

“ నీకీ కాంతారమునుండి నాతో వచ్చుటకు భయమగుచున్నదా ? ”

“ లే ” దని యా రాకొమరుఁడు బదులుపలికెను. అతని నా సన్న్యాసి యొక దేవాలయమునకుఁ గొంపోయి “ నాయనా ! ఇది మన యావాసము. నీవు దక్షిణపుదిక్కునకుఁ బోకుండ మిగిలినదిశలకే పోవుచుండుము. తూర్పు, ఉత్తర, పశ్చిమదిశలకుఁబోయి మనకు వలయు ఫలములను సేకరించి వచ్చుచుండుము ” అని చెప్పెను.

ఆతఁ డట్లేయని యొకనాఁ డొకదిశకుఁ మఱొకనాఁ డింకొకదెసకుఁ బోయి, పండ్లను గొనివచ్చెను. మూఁడవనాఁడు రాకుమారుఁడు దక్షిదిదిశకుఁ బోవలదని చెప్పినందున నత్యధికముగ కుతూహలముగలవాఁడై యా దిశగాఁ బోయెను. పోఁగాపోఁగా సోమశేఖరున కొక దేవాలయము కాన్పించెను. ఆ దేవాలయములో మహోన్నతమైన

వటవృక్షముండెను. ఆ వృక్షశాఖపై కొన్నివందల పుర్రెలున్నవి. అవి సోమశేఖరుని చూచి, నవ్వినవి—

"ఏమిది ? నన్ను చూచి నవ్వితిరేల ?" యని ప్రశ్నించెను.

"ఓయి వెఱ్ఱివాఁడా ! ఈ సన్యాసిని నమ్మివచ్చినాడవా ? మా వలెనే నీవును దురదృష్టవంతుఁడవైతివి. నీకును మా గతియే పట్టును లెమ్ము. తెలిసినదా ? నీ విపుడైన మేల్కొనుము. నేఁడో రేపో యాతఁడు నిన్నిటకుఁ గొనివచ్చి, ప్రదక్షిణము చేయుమని చెప్పును. నీవు అట్లొనరించితివేని, నీ శిరస్సును అంబకు బలియొనంగును. జాగరూకుఁడవై మెలంగుము." అని యా పుర్రెలు పలికినంతనే, సోమశేఖరుఁడు వల్లెయని వెడలిపోయెను.

ఆలయమునకుఁ బోయినపిమ్మట "నాయనా ! నీ వే దిక్కునకు పోయితి ?" వని సన్యాసి ప్రశ్నించెను. తూర్పుదిక్కునకని యాతఁ డనృతముఁ బలికెను. "సరే. నాతో రేపటిదినమున దక్షిణదిసకు రమ్ము. కొన్నివింతలఁ జూపెద" ననియెను. మఱునాఁడు అతఁడు సోమశేఖరుప తనతోఁగూడ దక్షిణదిశగాఁ గొంపోయి, యంబ యాల యమును జూపి "రాకుమారా ! దేవి మహామహిమోపేత, అభీష్ట ప్రదాయిని. కావున నీ వేగి యా సరోవరమున స్నానముఁజేసి రమ్ము. నే నింతలోఁ బూజసేయుచుందు" నని వాక్రుచ్చెను. సోమశేఖరుఁడు స్నానమొనరించి వచ్చినపిదప, నా కపటసన్యాసి "నాయనా ! దేవికి సాష్టాంగదండప్రణామ మాచరింపు" మనెను.

"అయ్యా ! క్షత్రియులమగుట మాకు ప్రదక్షిణము సేయుట సాష్టాంగపడుట తెలియవు. చేసి చూపు" మనెను. ఋషి యట్లేయని చేసి చూపఁబోవ, నా సమయమున సోమశేఖరుఁ డొరనుండి ఖడ్గము

నీవలకుఁదీసి ఒక్కవ్రేటున నా యోగినిఁ జంపెను. జగదంబ ప్రత్యక్షమై "నాయనా! నీ కేమికావలయునో కోరుకొనుము. దుర్మార్గుఁడైన యీ సన్యాసిని జంపి, భూభారముడిపినా" వనెను—

"మాతా! నా కేమియువలదు. నేను నీ సహాయము నర్థించి, తలంచినపుడెల్ల నా కోరికల సఫలమొనర్చు" మని వేఁడ నామె వల్లెయని తిరోహితియయ్యెను. రాకొమరుఁడు ఆ దిశ ననుసరించి, వెడలఁగా నొకచో నొకవృద్ధుని మృతకళేబరము కాన్పించెను. ఆ చర్మము నొలిచి, తన కెవరివలనను విపత్తు ఘటిల్లకుండుటకై యా వికృతివేషమును ధరించి, మాంగళ్యవతీ దేశమునకుఁబోయి యొకచో బసచేసెను. ఆ పూటకూటియింటి యజమానురాలు నుద్దేశించి, సోమశేఖరుఁడు అవ్వా! ఈ నగరపు విశేషములేవి?" మని పృచ్ఛఁజేయ నామె యిట్లులనెను—

"అయ్యా! మా దేశాధిపతి గోపీనాథమహారాజునకు మంజుభాషిణియను తనూజకలదు. ఆమె త్రిజగన్మోహనకరసౌందర్యవతి. నేఁడామెకు స్వయంవరమహోత్సవము" అని చెప్పెను. సోమశేఖరుఁడు భోజన మొనరించి, తానుగూడ యా స్వయంవరమహోత్సవాలోకనాయత్తచిత్తుఁడై, సభాభవనమున కరిగెను. వివిధదేశాధీశుల రాకొమరులు తమతమ యాసనముల నలంకరించిరి. సోమశేఖరుఁడు నొకచో నుపవిష్టుఁడై నపిదప రాకుమారి మంజుభాషిణి క్రొక్కారు మెఱుఁగువలె నరుదెంచెను. ఆమె రూపలావణ్యములఁ గని, సభాభవనములోనివారెల్లరు విభ్రమమందిరి. పుష్పదామమును కేల నిడుకొని, చెలికత్తె లిరువు రనుగమింప, తన యిచ్చవచ్చినవాని కంఠమున నా మాల వేయసంకల్పించుకొని యామె యొక్కొక్క రాకొమరునే క్రీగంటఁ జూచుచు వచ్చుచుండెను. సోమశేఖరుఁడు తన యిష్టదేవత

యగు దుర్గనెదం దలంచుకొని "భగవతీ! నే నీ వికృతాకారము ధరించియున్నను, మంజుభాషిణికి నా సహజస్వరూపముతోనే కనబడునట్లను గ్రహింపు" మని వేడుకొనెను.

మంజుభాషిణి యరుదెంచెను. కోటిమదన సమసుందరతేజుఁడై భాసిల్లుచున్న సోమశేఖరుఁ డామె యెడఁద నాకర్షింప వెంటనే పూలమాల నతని కంఠమున నిడెను. ఎల్లరకుఁ బైకి వికారముగనే కనబడుచుంటచే "ఛీ! రాకుమారి కోరికోరి యట్టి యసహ్యాకరాకారుని వరించిన దేమి? ఆమె మూర్ఖురాలువలె నున్న" దని నిందించుచు వెడలిరి. వివాహము జరిగెను. తమ తనయ, యెందఱో రూపవంతులగు రాజకుమారు లేతెంచియుండ, వారి నందఱనువదలి యీ కురూపుని వరించినందులకు దుర్భరవిచారవివశులయ్యు, యామె చిత్తము నొచ్చునేమో యని యూరకుండిరి. నాఁటిరాత్రి గర్భాదానము. సోమశేఖరుఁడు శయ్యాగతుఁడై యుండెను. మంజుభాషిణికిమాత్ర మాతఁడు జగన్మోహనాకారుఁడుగనే యుండెను. కొంతసేపు వారు సరససల్లాపము లాడినపిదప, నామె నిద్రించెను.

అతనికి చీకాకుగానుండి యా చర్మమును తొలఁగించి, మంచము క్రింద దాచి శయనించెను. అతఁ డట్లు నిద్రాముద్రితుఁడైనపిదప మంజుభాషిణి లేచి, యతనింగాంచి యానందపరవశయై, శరీరమును తడిమి చూచి "ఓహో! చిత్రము. ఇందాక నల్లగానున్న యీ శరీరమిపుడు బంగారమువలె నిట్లు మెరయుచున్నదే?" మని దీపముతో నా గదిని వెదకెను. ఆ చర్మ మామెకు కాన్పించినంతనే యవిధిలేని సంతోషమునంది, తలిదండ్రులకడకుఁ గొంపోయి వారికి దానింజూపి, తీసుకువచ్చెను. వారి రాక యతనికి మెలఁకువ కలిగించెను. ఆతని దివ్యసుందరాకృతిగని గోపీనాధమహారాజు మహదానందమంది "నాయనా!

నీకీ రూపమేల ? నీ వృత్తాంతమును దెలుపు” మాయని యడుగ తాను కౌముదీదేశాధిపతియైన కీర్తిమంతుని తనయుఁడ నని వచించెను.

మఱునాఁడు వికృతవేషమునుధరించి యాస్థానమునకు రమ్మని గోపీనాధుఁడు చెప్పి, సోమశేఖరుని, గొంపోయి మంత్రిసామంతబంధు మిత్రాదులఁ గాంచి “నేఁడు సుదినము. నా యల్లుఁడు కారణాంతరములచే వికృతాకారము ధరించియున్నాఁడేగాని నిజముగా కాదు. చూడుఁ” డని యా వేషము తొలఁగింపఁజేయుసరికి, సోమశేఖరుని యందచందములఁ గని వారు దిగ్భ్రాంతులైరి. కొలఁదిమాసములు శ్వశురగృహముననుండి, యనేకములైన కానుకలతో భార్యను దోడ్కొని కౌముదీదేశమునకుఁబోయెను.

తమ తనయునిజాడయే తెలియక బాధపడుచుండిన యా దేశాధీశుఁడు కీర్తిమంతుఁడు కుమారుని కోడలునుజూచి, నితాంతసంతోష తరంగితహృదంతరుఁడాయెను.

ఈ కథ ముగియుసరి కర్ధరాత్రము గడచినందున మంజరియు నచటనే నిదురించి, ఉదయమున వెడలిపోయెను.

# 22 కర్పూరవల్లిక

—:o:—

మఱునాఁడు రాజుకడకరుగ నుద్యుక్తయైన పద్మినింజూచి చిలుక "అక్కా! మనువు లెన్ని చెప్పినను—ఏదో మానవన్న సామెత నీ యెడ సార్థకమగుచున్నది. నిన్న నేనన్ని చెప్పితినిగదా! నీవు వినవైతివి. నేఁడు మఱల తయారగుచుంటివి. అయినను కర్పూరవల్లికథ చెప్పెద నాకర్ణింపుము. అయ్యది చాలమంచిది. ఎంతో ఆనందము కలుగు" నని యీ విధముగఁ జెప్పసాగెను.

తొల్లి ప్రాగ్జ్యోతీదేశంబున వసుదేవమహారాజు పాలించుచుండెను. ఆతనిభార్య నాగమణి. కుమారుఁడు కామపాలుఁడు. కామపాలుఁడు నవమోహనాకారుఁడగు యువకుఁడు. అతనికి వివాహోచిత ప్రాయము ప్రాప్తించెనని తండ్రి వసుదేవుఁడు వివాహ ప్రయత్నములఁ జేయసాగెను. అదిచూచి, కామపాలుఁడు "జనకా! నాకు నచ్చిన కన్యను నేనే బరిణయమాడివచ్చుట కనుమతించుము." అని యడుగ నా నృపాలశేఖరుఁ డంగీకరించి వలయుధన మిచ్చెను. ఆసొమ్మునఁగొని యశ్వారూఢుఁడై కామపాలుఁ డనేకదేశముల సందర్శించి యా రాకొమరితల గాంచి "నే నొక ప్రశ్న నడిగెదను. దానికి సదుత్తరమొసంగినయెడల నేను వివాహముఁ జేసికొందు" ననెను. రాకుమార్తెలలో నొక్కరును నా రాసూనుని ప్రశ్నకు బదులు చెప్పఁజాలక పోయిరి. అతఁడు తిరిగితిరిగి తుదకు సింహళద్వీపమునకుఁ బోయెను. ఆ ద్వీపము నేలు దిలీపమహారాజునకుఁ గర్పూరవల్లియను కొమరిత కలదు. అపరంజితీఁగవలె భాసిల్లు నా కన్య యుద్యానవనముంజొచ్చి, కామపాలుఁడు నిద్రించెను. పుష్పాపచయమునకై యా సుందరి యుప

వనముంజొచ్చి, యొక మహీరుహచ్ఛాయను నిద్రించుచుండిన కామ
పాలునిఁ గాంచి "ఆహా! ఈ నవమోహనాంగుఁ డెవరో, నా చిత్త
మునఁ బ్రేమానలము విజృంభింపఁజేసినాఁడు. నేనేమి సేయుదాన?"
నని తన తల్లితోఁ జెప్పెను. ఆమె నిజనాథునికిఁ దెలియఁబఱచెను.
దిలీపుఁడు సపరివారుఁడై యరుదెంచి, కామపాలుని వదనమండలమున
తేజరిల్లుచున్న క్షాత్రతేజమును గని, యానందప్రపూర్ణాత్ముఁడై
యతనిని మేల్కొలిపెను.

"నాయనా! నీ వెవరవు? అతియాసఖిన్నుఁడవై యున్నట్లు
తోఁచుచున్నది. ముందుగా స్నానముచేసి, భోజనమొనరింపు" మని
లోనికిఁ గొంపోయెను. భోజనానంతర మాతఁడు తన యుదంతము
నెఱిఁగించి, తన ప్రశ్నకు సత్సమాధాన మొసంగినకన్యను బెండ్లిచేసి
కొందునని తెలిపెను. రాజకుమారి తాను సమాధానము చెప్పెద
ననెను. ఆమె వచ్చి యెదుట నిలుచుసరికి కామపాలుఁడు విభ్రాంతుఁ
డాయెను. తాను చూచినకన్య లెవరును యామెతోఁ బోల్చుటకైనఁ
దగరని యతఁడు గ్రహించెను.

"నలుగురున్న సభలో నా మానము కాపాడగలవా?"
యని కామపాలుఁడు ప్రశ్నింప "మీ దయయున్న నెంతయైనఁజేయు
గలను. మానము కాపాడనిచో మానవతిని కాగలనా?" యనెను.
కామపాలుఁ డా సమాధానమునకు సంతసించెను. వారి యిర్వురకును
మహావైభవముగ వివాహము చేయఁబడెను. కొలఁదిమాసము లట
నుండి యా కామపాలుఁడు స్వదేశమునకు సతీసమేతుఁడై బయలు
దేఱెను.

వారు కొలఁదిదినములు పయనమొనరించి, మార్గముతప్పి
యొక యరణ్యముఁ జేరిరి. మార్గాయాసమును మిక్కుటమగుటచే

వారొక వృక్షమునీడను విశ్రమించిరి. కర్పూరవల్లి నాథునిఁ జూచి "ప్రాణేశ్వరా! క్రూరమృగాకులంబైన యీ గహనాంతరమున నుండుట క్షేమముకాదు. మనము సాయంకాలమువఱకును బయన మొనరించి, ఏదేని నగరముచేరుట మంచి" దనెను.

"ప్రియసఖీ! అట్లు చేయనద్దు. నీవు నా కంటె మిక్కిలి యలసియున్నావు. అశ్వమును ఆయాసపడియున్నది. ఒక్క యడుగైన వేయఁజాలని స్థితిలోనున్న హయమును బాధపెట్టుట యుచితముకాదు. నీ విచటనే యుండుము. నేను నగరములోనికిఁబోయి మనకు వంటకు కావలసిన పదార్థములన్నియు గొనివచ్చెదను. సాయంకాలమువఱకు నిటనే విశ్రమించి, మఱల బయలుదేఱుదము." అని కామపాలుఁడు వచించెను. తనకడనున్న యాభరణము లన్నిఁటిని, ఆమె నాథున కొసంగెను. 'ఒంటరిగా నున్నప్పు డిన్నినగలెందుకు? ఏ చోరులైన వచ్చినచో మోసము వాటిల్లు' ననెను. అతఁ డా యాభరణముల నొకమూటగాఁ గట్టి, తనతోఁ గొంపోయి ఆ వనమునుదాటి యొక పట్టణముఁ జేరెను. ఆ పురముపేరు విశ్వంభరపురము. దాని నేలు నృపాలుఁడు భాస్కరసింహుఁడు. ఆ పురమున నారాయణశెట్టియను భాగ్యశాలియగు వణిజుఁడు కలఁడు. అతనికడ కరిగి, కామపాలుఁడు కొన్ని బంగారు నాణెములిచ్చి, సరకుల నిమ్మనెను—ఇతనింజూచి యా శెట్టి మీ దేయూరు. మీ రెవరని యడిగెను. కామపాలుఁడు తన సమాచారము నెఱిఁగించి, తన సతి నరణ్యమున విడిచివచ్చితినని, త్వరితముగఁ బదార్థములిచ్చి పంపు" మనెను.

సహజముగా కుటిలాత్ముఁడైన యీ నారాయణశెట్టి లోనికిఁ బోయి, నౌకరుల నా యరణ్యముకంపి "నీ భర్త నారాయణశెట్టి

యింటికడ నున్నాఁడు. నిన్ను రమ్మనినాఁడు" అని చెప్పి పాణిద్వార మున మేడలోఁ బ్రవేశపెట్టుమని చెప్పెను. నౌకరు కానసమున కరిగెను. ఏవో ముచ్చటించుచు, సరకుల బేరమునకై వచ్చు తదితరులతో సంభాషించుచు, కామపాలుని చాలసేపు కూర్చుండబెట్టెను. నౌకరు కర్పూరవల్లిని జూచి, యదే ప్రకారము చెప్పగా, నామె విశ్వసించిఁ బయలుదేరెను. ఆమెను పాణిద్వారమున సౌధమునఁ బ్రవేశపెట్టి పరి చారకుఁడు అంగడిలోనికి వచ్చి కనుసన్న యొసర్చ, నది గ్రహించి శెట్టి కామపాలునకుఁ గావలసిన సరకుల నన్నిఁటిని యిచ్చి పంపెను. అతఁడు విపినాంతరమునకుఁబోయి, భార్యనుగానక యెవరో దుర్మార్గు లపహరించిరో, చంపివైచిరోయని యున్మాదుఁడై తిరిగితిరిగి యీ నగరమునకే వచ్చి, మతిపోయినవానివలెఁ దిరుగుచుండెను.

అట కర్పూరవల్లి లోనికివచ్చినంతనే శెట్టి "మీరు మేడమీద నుండుడు. మీ నాధు డిపుడేవచ్చు" ననెను. ఆమె యెంతోసేపు వేచియుండెనుగాని యతఁడు రాడాయెను. రాత్రి పదిగంటలకు యెవరో పైకి వచ్చుచున్నట్లు అలుకుడాయెను. ఆమె భర్త యరుదెంచుచున్నాఁ డని తలంచెను. నౌకరువచ్చి ఫలహారములతోను, పాలతోను నిండిన పాత్రలఁదెచ్చి "అమ్మా! మీ భర్తగారు శెట్టిగారుకలిసి ఫలాహారముఁ జేయుచున్నారు. మీరు భుజింపు" డనెను. అప్పుడును ఆమె విశ్వసించెను. ఆ ఫలహారముల భుజించి, దుగ్ధమును ద్రాగెను. రాత్రి యెంతోసేపు మేల్కొని నిద్రించెను. ఉదయమున శెట్టివెళ్ళి "రాజకుమారీ! నీ యందచందములు నన్నాకర్షించినవి. నేనే యీ పన్నుగడ మూలమున నిన్నిటకు రావించితిని. నీ భర్త నిన్ననే వెడలిపోయినాఁడు. నా దగ్గఱనేయుండి సుఖంపుము నీకే లోపమును గలుగబోదు. నిన్ను

బంగారుతూగుటుయ్యెలలోఁ గూర్చుండబెట్టిన" ననుసరికి కర్పూర వల్లి మూర్ఛాగతయయ్యెను.

ఆమెకు పరిచారికలు శైత్యోపచారములఁ గావించిరి. భర్తకోస మామె బెంగఁగొని యాహారము ముట్టదాయెను. నాలు గైదు, వారము నెల గడచిపోయెను. ఆమెను శెట్టి యనుదినమువచ్చి తన్ను ప్రేమింపుమని బాధింపఁదొడఁగెను. తుదకామె యొకయుపాయ మాలోచించెను. తనభర్త యీ నగరముననే వెదకుచుండుననియు నతఁ డటకే వచ్చునట్లు చేయ నెంచి, శెట్టి యీ సాయంకాలము తనకడకురాగా "అయ్యా! నేను నీకు వశమగుటకుముందు నా నోము సంపూర్తి కావలసియున్నది. అందుకుగాను దినమునకు నూరువరహాలు కావలయును. రెండుమాసములు పూజ బ్రాహ్మణసమారాధనము జేసినయనంతర ముద్యాపనదినమున వేయిమంది బ్రాహ్మణులకు సంతర్పణ జేయవలయును. దక్షిణ లీయవలెను. ఈ వ్రతము చక్కఁగా నెరవేర్పఁజేసిన యెడల నీ కోరిక సఫలమగు" ననెను.

ఐశ్వర్యమదోన్మత్తుఁడైన యీ నారాయణశెట్టి యటులనేయని రోజురోజును నూరేసివరహా లంపుచుండెను. ఆమె యనుదినము దేవికిఁ బూజలొనర్చి, బ్రాహ్మణులకు సమారాధనము సేయుచుండెను. ఇవ్విధమున రెండుమాసములును గడచిపోయినవి. ఉద్యాపనమునాఁడు వెయ్యిమంది బ్రాహ్మణులకు సంతర్పణ చెయ్యఁబడెను. అదేదో చూచి వత్తుమని కామపాలుఁడును మాసినగుడ్డలతో నటకు వచ్చెను. అతనిం జూచి, యానందభరితహృదయయై, యొక లేఖను వ్రాసి యందు కొన్ని వరహాలుంచి, యతని కిచ్చెను. అతఁ డామెను తేరిపారఁజూడక యావరహాల నెవరికోయిచ్చి, యీ యుత్తరమును క్రిందఁ బారవైచెను. దాని నొకశూద్రుఁడు తీసి చదివెను. అందు "నాథా! రాత్రి 12 గం

టలకు పాణిద్వారముకడ కశ్వారూఢుఁడవై రమ్ము." అని వ్రాయఁబడియుండెను. ఆ లేఖను జూచుకొని యా యువకుఁ డానాఁటిరాత్రమున నారాయణశెట్టి సౌధపాణిద్వారముకడ కరిగెను.

శెట్టినుండి గుంజిన ధనముతో కర్పూరవల్లి, యర్ధరాత్రమున నందఱును గాఢనిద్రాముద్రితులై యుండ పాణిద్వారమును దెఱచి, యశ్వారూఢుఁడు తనభర్తయేయని యెంచి, యా హయముపైఁ దానును గూర్చుండెను. హయము శరవేగమునఁ బరుగెత్తసాగెను. తెల్లవారుసరికి వారొక యరణ్యముం జేరిరి. ఆమె యతఁడు తనభర్త కాఁడని, యెవఁడో యా లేఖను సంగ్రహించి, యీ విధముగా మోసగించినాఁడని గ్రహించి, ధైర్యమువహించి, యీ దుష్టునిబాఱినుండి యెట్టులైనఁ దప్పించుకొననెంచి, "ఓయీ! ఇంతదూరము సైంధవముపైఁ బ్రయాణము చేసినందున నాకు దాహము మిక్కుటముగ నున్నది. సమీపమున నెచటనైన కొలనున్నదేమో చూచి, జలముఁ గొని తె"మ్మనెను. ఆతఁడు వెడలినంతనే యామె కర్తవ్యము నూహింపగడంగెను. ఇంతలో నా మార్గమున చోరు లరుదెంచిరి. వారు యామెను సమీపించిరి. ఆమె వారు చోరులని తెలిసికొని "అన్నలారా! అబలను నన్ను హింసించిన మీకు గల్గులాభమేమి! నామాట వినుఁడు. మీకు లక్షలకొలఁదిగ ద్రవ్యలాభముకలుగు రహస్యమును జెప్పెద" ననెను—

"అమ్మా! మహాలక్ష్మివలెనున్న నీవు మా గుహకు రమ్ము. నీ కేలోపమును గలుగకుండ చూచుట మా వంతు. మాకు వేళకింత యాహారము నిచ్చుట నీ వంతు" అనిరి. శూద్రునిబాధ తప్పెనని కర్పూరవల్లి యా దొంగలగుహకుఁ బోయెను. ఆనాఁడు నగరములోనికి వారు చౌర్యమునకై వెడలిరి. వారి కెంతో ధనము ఆభరణములు

లభించెను. అందుచే వారామెయెడ నధికమగు గౌరవముకలిగి మెలగు చుండిరి. నారాయణశెట్టి భవనమున ధనమున్నస్థలము తనకుఁ దెలి యును కావున ఆమె దొంగలకు వివరములన్నియుఁ దెలిపి, పంపెను.

చోరు లా రాత్రి నారాయణశెట్టి సౌధమునఁ బ్రవేశించి లక్షవరహాలు, పెక్కు ఆభరణములు గొనివచ్చిరి. ఆమెను వారు దేవ తవోలెఁ బూజింపసాగిరి. ఇట్లు కొలఁదిదినములు గడచెను. విశ్వంభర పురమునేలు భాస్కరసింహుఁడు చనిపోవుటచే నా దేశపుఁ బ్రజలు పట్టపుటేనుగు తొండమున కొక పూలదండనిడి, యా దండ నెవరి కంఠ మునవైచునో నతఁడే తమరాజై, రాకొమరిత సౌదామినిని బెండ్లియా డునని ప్రకటించిరి. ఈ సమాచారము చోరులవలన విని, వారు నగరములోనికిఁ బోయినయదనుగాంచి, తాను బురుషవేషము ధరించి, మోయుగలిగినంత ధనమును ఆభరణములను మూటకట్టి, యశ్వము నెక్కి నగరములోనికిఁ బోయెను.

అప్పుడే కుంజరము, ప్రజలు, రాజోద్యోగులు నా మార్గమున వచ్చుచుండిరి. గుఱ్ఱము బెదరునేమోయని సంశయించి, పురుషవేష ధారియైయున్న కర్పూరవల్లి క్రిందకు దిగినది. ఏనుఁగు తిన్నగావచ్చి యా పుష్పదామమును కర్పూరవల్లి కంఠమునవైచినది. ఆమె నాసామ జము నారోహింపఁజేసి, యూరేగించి, రాజభవనమునకుఁ గొంపోయిరి. తాను గొనివచ్చిన ధనము నొకచో జాగ్రతపరపించి, కర్పూరవల్లి తన నామధేయము రామసింహుఁ డనియెను. శుభదివసమున రామసిం హునకును సౌదామినికిని వివాహము జరిగెను. వివాహానంతరము రామసింహుఁడు పట్టాభిషిక్తుఁడాయెను. భార్య యా నాఁడు తనకడకు రాఁగా, రామసింహుని రూపముననున్న కర్పూరవల్లి "ప్రియసఖీ! ఒక నెలదినములవఱకు నా కొక నియమమున్నది. అంతదనుక మన మేకశయ్యాగతులమై యుండరాదు" అనెను.

సౌదామిని యందుల కియ్యకొనెను. నగరములో నాలుగుదిశ లను నాలుగు ధర్మశాలలు రాజాజ్ఞానుసారముగ నిర్మింపఁబడెను. ఆధర్మ శాలలందు కర్పూరవల్లి చిత్రపటములు వ్రేలాడఁదీయఁబడి, రక్షకభటులు నిత్యము నట కావలిగాయుచు నెవరైన నా ప్రతిమనుజూచి నవ్వినను, నిందించినను, విచారించినను తనకడకుఁ గొనిరావలెనని కఠినముగ శాసించెను. ఆమెను మోసగించి గొనిపోయిన శూద్రుఁడా ధర్మశాల కొకనాఁ డేగి, యా చిత్రపటమునుజూచి "ఓ నారీమణీ! నన్నెట్లు మోస గించితివి. నీ కిదిన్యాయమా! ఆ నాఁటినుండియు నీకొఱకు నే నెంతగా పలవించుచున్నానో నీవు గ్రహింపవైతివిగదా!" యని యనుకొను చుండగా రక్షకభటుఁడు చూచి వానిని గొంపోయి రాజాజ్ఞానుసార ముగ కారాగృహమున నుంచెను.

మఱొకనాఁ డింకొక ధర్మశాలకు నారాయణశెట్టి వచ్చెను. దొంగ లతనిభాగ్యమును కొల్లఁగొట్టుటచే దరిద్రుఁడై పోయిన యా వణి జుఁడు కర్పూరవల్లింజూచి "మాయలాడి రాకుమారీ! ఎంతపనిచేసి తివి? నన్ను ఫకీరునుజేయుటకు నీవేకదా కారణము? నీవు దొంగవు." అని నిందించెను. వానిని రక్షకభటుఁడు బంధించి, కారాగారమున నుంచెను. మఱునాఁడు కామపాలుఁ డొకధర్మశాలకుఁబోయి, కర్పూ రవల్లి చిత్రమును దదేకదీక్షతోఁ జూచి, పూర్వవృత్తాంత మొక్క సారిగా జ్ఞప్తికిరాగా "హా ప్రియసఖి!" యని మూర్ఛనొంది, యొకింత సేపటికిఁ దెలివొంది "నీకై నేను మతిమాలినవాఁడనై యివ్విధమున బరిభ్రమించుచుంటినిగదా! నీకు దయరాదేమిసేయుదును. ఎటనున్నావో గదా సఖి!" యని వివిధముల విలపింపసాగెను.

రక్షకభటులు కామపాలుని, రామసింహుని రూపముననున్న కర్పూరవల్లికడకుఁ గొంపోయిరి. ఆమె హృదయేశుని గుర్తించి, వెం

టనే పరిచారకులచే స్నానముఁ జేయింపజేసి, పరిశుభ్రవసనము లిచ్చి, భోజనము పెట్టించి, యొకచో నిర్బంధమునమంచి, యతని కేలోపమును రాకుండ చూడుఁడని భటుల కాజ్ఞాపించెను. పదునైదు దివసములు గడచుసరికి, ఆ రాకుమారుఁడు సంపూర్ణారోగ్యవంతుఁడై, సహజసౌందర్యమును గోల్కొనెను.

దొంగలు ధర్మశాలకువెళ్ళి కర్పూరవల్లి పటమునుజూచి "నిన్ను నమ్మినందులకు మమ్ము ద్రోహముచేయుట న్యాయమాతల్లీ" యని యేడ్చిరి. వారినికూడ రక్షకభటులు బంధించిరి. దొంగలుకూడ కారాగృహమున నుంచఁబడిరి. రాజకుమారి సౌదామిని తనభర్త కామపాలుని క్షేమమువిషయమై యంతశ్రద్ధ కలిగియుండుటకు హేతువేమై యుండునాయని యోచించుచుండెను. ఒకనాఁడు రామసింహుఁడు కొలువుకూటమునకు సకలసామంతసేనానాయక బంధుమిత్ర పరివారమును రావించెను. ప్రక్కగా వేరొకగదిలో సౌదామినియు, నామె తల్లియుఁ గూర్చుండిరి. అప్పుడు రామసింహుని రూపముననున్న కర్పూరవల్లి, దొంగలను, శూద్రుని, కామపాలుని, నారాయణశెట్టిని రావించి, విచారణ మారంభించెను.

నారాయణశెట్టి, తనకడకు సరకులనిమిత్తము కామపాలుఁడు వచ్చుట, తాను రహస్యముగ పరిచారకునంపి కర్పూరవల్లిని రప్పించుట ఆమె వ్రతవృత్తాంతము, చోరులు తన యాస్తిని గొల్లఁగొట్టుటమున్నగు నవన్నియుఁ దెలిపి, తాను ధర్మశాలలోఁ జూచి, యామెను నిష్ఠూరముగ మాటలంటినని యొప్పుకొనెను. శూద్రుఁడు తానామెను శెట్టి భవనమునుండి యశ్వముపైఁ గొనిపోయినానని, తనకు లభించినయుత్తరము సమాచారము నెఱిఁగించి, తన్నడవిలో జలముగొనిరా నియోగించి, తాను తిరిగివచ్చుసరికి మాయమగుటచేఁ దాను ప్రణయోన్మా

డుఁడనై, యివ్విధమున నిష్ఠురాలాపము లాడితినని చెప్పెను. దొంగలు జరిగినదెల్ల చెప్పిరి. కామపాలుఁడు తా నొనరించిన తప్పిదమును జెప్పి, యా చిత్తరువులోని కర్పూరవల్లి తన సతి యగుటచే ఏడ్చినానని చెప్పెను.

" మహాజనులారా! మీరొక చిత్రమును జూడబోవుచున్నారు. ఆ చిత్రములోని కర్పూరవల్లిని నేనే. రామసింహుఁడను పేరుతోఁ బురుషవేషము ధరించి, మీ రాజ్య మేలుచుంటిని. నా భర్త కామపాలుఁడే మీకు రాజు. సౌదామినికి—కామపాలునకు వివాహము సేయుదము. మే మిర్వురము నక్కసెల్లెండ్రము " అనెను.

ప్రజ లానందకోలాహల మొనరించిరి. శెట్టి ధన మతని కీయఁబడి యెన్నడు నట్టిమోసము చేయవలదనియు, నతని వంచనవలననే తాను పెక్కు యిక్కట్లకు లోనైతిననియు నిఁకముందట్టి నేరమున దోషిగా నెన్నఁబడుచో మరణశిక్ష విధింపఁబడునని హెచ్చరింపఁబడెను.

శూద్రుఁడును వదలివేయఁబడెను. శుభదినమున సౌదామినీ కామపాలురకు వివాహము సేయఁబడియెను. కామపాలుఁడు రాజ్యాభిషిక్తుఁడాయెను. ఈ సమాచార మతని తలిదండ్రులకుఁ గూడ తెలిసెను. వారు తమ రాజ్యమునకును కామపాలుని పట్టాభిషిక్తు నొనరించి "రని కీరము కథ ముగించెను.

పద్మిని యానందవికసితాననయై, హాయిగ నిదురించెను.

# 23 మనోరమకథ.

——:o:——

ఆనాఁడు చిలుక పద్మినిని సాయంకాలము పిలిచి "అక్కా! నేఁడట్లు బద్ధకముగ నున్నావేమమ్మా!" యనెను. "ఏలాగుననున్న నెవరికిఁ గావలెనమ్మా! రాజు నా కొఱకు మనోవ్యాధిపీడితుఁడై, మంచము పట్టినాఁడని తెలిసినది. నా కేమియుఁ దోఁచుటలే" దనెను—

"వెళ్ళి వచ్చినచో నీవును, ఆమాట తెలిసినచో నీ నాథుఁడునుకూడ మంచము పట్టవలసివచ్చునేమో నుమా! కామాంధుఁడైన రాజుకొఱకు నీకు పరితాపమేల? నీకీ కథలు నే నుబుసుపోకకు చెప్పుట లేదు. వీనివలన నీవు నీతిని గ్రహించి, నీ హృదయమునఁ బరివర్తనము దెచ్చుకొందువనియే జెప్పుచున్నాను. నేఁడు నీకు మనోహరమైన మనోరమకథ చెప్పెద నాకర్ణింపు" మని యీ రీతిగాఁ జెప్పసాగెను.

తొల్లి శాంభావతీపురంబును జయగోపాల మహారాజు పరిపాలించుచుండెను. ఆ రాజన్యునకు లేకలేక యొక కొమరిత జన్మించెను. ఆ బిడ్డ క్రమక్రమముగా ప్రవర్థమానయై నవమోహనాంగి యగుచుండెను. ముద్దుకై ఆమె నేనుఁగుపై నంబారివైచి, కూర్చుండబెట్టి నగరమంతయు నూరేగించుచుండెను. ఆమె తన యిష్టమువచ్చినచోట క్రిందికి దిగుచు, నచటనున్నవారిచే లోని కాహ్వానింపఁబడి, ఫలహారములు, పాలు మున్నగునవి యారగించుచుండెను. ఈ రీతిగా, గొన్ని సంవత్సరములుగడచినవి. ఆమె ప్రౌఢయయ్యెను. రాజు "అమ్మాయీ! మనోరమా! నీ విపుడు ప్రౌఢవైనందున నిదివఱకువలె కుంజరము నెక్కి నగరములోనికిఁ బోరాదు. తన్మూలమున మన కప్రతిష్ఠ సంభ

వించు" ననెను. జనకునియాజ్ఞానుసారముగ మనోరమ యంతఃపురము ననే యుండిపోయెను. నాలుగురోజు లగుసరికి మావటీఁడువచ్చి "మహారాజా! పట్టపుటేనుఁగు నాలుగుదినములనుండి యాహారము స్వీకరించుటలేదు. అమ్మాయిగా రంతఃపురమున నుండిపోవుటయే దీనికి కారణమై యుండనోపు" ననెను. మహారాజు మంత్రినిజూచి "ఏమి చేయుద" మనెను—

"వలదు. మనోరమకు యుక్తప్రాయము ప్రాపించినది. ఆమెను నగరములోనికి యథాప్రకార మూరేగింపఁ బంపినచో మనలఁగూర్చి ప్రజలే పెక్కువిధములఁ జెప్పుకొందురు. ఏమైననుసరే—పంపవల" దని యమాత్యుఁడు చెప్పెను. రాజు మఱి నాలుగుదినము లూరకుండెను. మావటీఁడువచ్చి, కుంజరము ఆహారము స్వీకరించుటలేదని యుఁ గొన్నాళ్ళట్లు యుపేక్షించినచో మరణించునని చెప్పెను. మహారాజు అంబారికి పరదావేయించి అమ్మాయి నెక్కించుమని చెప్పెను. ఏనుఁగు మనోరమ నెక్కించుకొని యడవిలోనికిఁ గొంపోయి పండ్రెండుగంటలకు, దిరిగివచ్చెను. మఱునాఁడు అరణ్యములోనికిఁగొంపోయి, యొకచో నాగెను. కుంజరమునుండి, మనోరమ క్రిందకు దిగెను. ఏనుఁగు రాకుమారికి ఫలములఁ గొనివచ్చుటకై యేగెను. ఇంతలో నశ్వారూఢుఁడై యొక రాకుమారుఁ డామార్గమున వచ్చెను.

"కోమలీ! నీ వెవరు? భయదమైన యీ విపినాంతరమున నొంటరిగనుండ కతమే?" మని ప్రశ్నింప నామె యతని సౌందర్యమున కబ్బురమందినదై "రాకుమారా! శాంభావతీపురము నేలు జయగోపాలమహారాజు కుమార్తెను. నా నామధేయము మనోరమ. మీ రెవ?" రని ప్రశ్నించెను.

" నేను పుళిందనగరాధిపతి కామేశ్వరవర్మ మహారాజ కుమారుఁడను. మృగయావినోదార్థమై యిక్కాంతరమున కరుదెంచితిని. సుందరీ! నిన్ను చూచినంతనే నా హృదయము నీ యందు లగ్నమైనది. నిన్ను వివాహము చేసికొందును. నా దేశమునకు ర "మ్మని పుళిందనగరపు రాకొమరుఁడు ప్రచండవర్మ పలికెను. రాజకుమారి నా హృదయాధినాథా! నాకును నీ యందు ప్రథమసందర్శనముననే ప్రేమోదయమైనది. నన్ను మా పట్టణపు టేనుఁగు వదలుటలేదు. అదిగో వచ్చుచున్నది. నిన్ను చూచెనా, చంపునేమోయని భీతి జనించుచున్నది. నీవు నా యందు దయయుంచి, తేపటిదినమున మఱల నీ వేళకే యిటకు రమ్ము " అనెను.

ప్రచండవర్మ హయారూఢుఁడై పుళిందనగరమునకుఁబోయెను. సామజము తెచ్చిన ఫలముల నారగించి, మనోరమ యంబారీనెక్కెను. అయ్యది యామెను నగరమునకుఁ గొంపోయెను. మఱునాఁడు మఱల నదేవిధముగ మనోరమ కుంజరారూఢయై, కాంతారమునకుఁబోయెను. ఏనుఁగు ఆమె నొక చూతవృక్షముకడ దింపి, జలము త్రాగుటకై వెడలెను. రాకుమారుఁడు ప్రచండవర్మకూడ అరుదెంచి యామెను గలిసికొనెను.

" ప్రియురాలా! మన యిరువురకు వివాహమగు నుపాయమెఱింగించుమా? " యనెను. " సఖా! అంతమాత్రమైన నీవూహింపలేవా? రంభశాపమునకు విముక్తి కలిగించిన నాగశర్మవలె నీ వేదైన యుపాయ మూహింపఁజాలవా? " యని యడిగెను. అతఁడు " హృదయేశ్వరీ! ఆ నాగశర్మ కథ నెఱిఁగింపుమా " యనెను.

# 24 నాగశర్మకథ.

---

మనోరమ యిట్లు విధమునఁ జెప్పదొడంగెను—

"పూర్వము జలంధరపురమున నాగశర్మయను బ్రాహ్మణ యువకుఁడు వేదము చదువుకొనుచుండెను. ఆ యూర నొక దేవాలయము కలదు. అతఁ డనుదినము నటకుఁ బోవుచుండును. ఆ దేవాలయమునందు దేవతల ప్రతిమలన్నియు నున్నవి. శిల్పి యా ప్రతిమల నతిచతురతతో రచించియుండెను. నిగమశర్మ రంభ ప్రతిమను గాంచి, మోహావివశుఁడై, యహర్నిశము లామెనే తలంచుచుండెను. ఒకనాఁ డతఁడు దేవాలయమునకు వెళ్ళునరికి రంభయే యచట నుండెను. ఆమె యనుదినము నేదో యొక సమయమున నా దేవాలయ సరోవరమున కరుదెంచి, స్నానముచేసి పోవుచుండును.

తన ప్రతిమనుజూచి, మోహమగ్నుఁడై పలవించుచున్న యా యువకుని సౌందర్యముగాంచి, యానందభరితాత్మయై రంభ "ఓయీ! నాగశర్మ! నా కొఱకేనా యట్లు పలవించుచున్నా"వని యడిగెను. నాగశర్మ తన యెదుటనున్న రంభనుగాంచి యతులితానందమంది "ఆహా! ఏమి నా భాగ్యము. నిన్ను గాంచి, తరించితి" ననెను.

ఆమె మదనశరపీడితుఁడై యున్న నాగశర్మకు భోగసుఖమొసంగి వెడలిపోయెను. అనుదినమును నాగశర్మ యా కోవెలలో రంభను కలిసికొనుచుండెను. ఒకనాఁ డతని మిత్రులు రంభను, నాగశర్మను జూచి యా యుదంతమును గురున కెఱిఁగించిరి. శిష్యుని మహాభాగ్యమును

గాంచి, సంతోషించి గురువు "నాగశర్మా! రంభా సంభోగభాగ్యమం దుటచే నీవు ధన్యుఁడవు, పరమపవిత్రుఁడవునైతివి. ఆమె దేవతయగు టచే నాగతానాగత వేదియగును. నేనేమైన పాపము చేసితినేమో యామె నడుగు" మనెను.

నాగశర్మ మఱునాఁడు రంభ వచ్చినపుడు "హృదయేశ్వరీ! మా గురువుగారు ఏమైనా పాపము చేసియున్నారా?" యని ప్రశ్నించెను. "ఆమె యాలోచించి ఆయనకు పుట్టగతులుకూడ నుండనంత పాపము చేసినారు. ఆయనకు నరకమే ప్రాప్తి" యనెను. నాగశర్మ యా వృత్తాంతమును గురువున కెఱిఁగించెను. గురువు వ్యధితాత్ముఁడై "నాయనా! నాగశర్మ! నా యీ పాపము నశించుమార్గముకూడ నడుగ లేకపోయినావా?" యని ప్రశ్నించెను.

రంభ నతిఁడు మఱల నడిగెను. ఆమె "హృదయాధి నాథా! ఒక పనిచేసినచో మీ గురువుగారి పాపములు తొలఁగును. ఆయన కొక వితంతు కొమరితకలదుగదా! ఆమె నూరి వెలుపల కాపురముండ నియమించి, యనుదినము నాయన యటకేగి వచ్చుచున్నచో ప్రజలు వివిధములఁ జెప్పుకొని యా పాతకమును విభాగించుకొందురు. తన్మూలమున మీ గురువు పాతక విముక్తుఁడగును." అని చెప్పెను. గురువరేణ్యు, డట్లే కావించెను. వయస్సులోనున్న కొమరితయింటికి తఱుచుగా వెళ్ళుచున్నందున లోకులు పలుగాకులై వివిధములైన వదంతుల వ్యాపింపఁజేయుచుండిరి. పాతకమెల్ల వారు పంచుకొనుటచే, గురువు పాపవిమోచనమందిన సమాచారమును దేవేంద్రుఁడు గ్రహించి, దేవరహస్యమును భూలోకమునఁ జెప్పినందుల కీవు సముద్రముకడ తూర్పుతీరమున దిబ్బవై యుండు" మని శపించెను.

రంభ భూలోకమునవచ్చి, తన ప్రియుఁడైన నాగశర్మతోఁ జెప్పి, మఱల నాకమునకుఁబోయి "మహేంద్రా! నాకు శాపవిముక్తి

నను గ్రహింపు" మని బ్రతిమాల "పదివత్సరములలోపున నీవు కామించిన యా బ్రాహ్మణయువకుఁడు ఆ దిబ్బపై సముద్రము ప్రవహించునటుల చేయునెడల నీవు శాపవిమోచనమునొంది, యిక్కడకు వత్తు" వనెను. ఆమె యాప్రకారముగనే చేసెదనని పలికి, భూలోకమునకువచ్చి, నాగశర్మతో తన శాపోపసంహారవిధానము నుడివి, క్షుత్పిపాశలు లేకుండునట్టొక సువర్ణాంగుళీయము నిచ్చి, సముద్రతీరమునకుఁబోయి, దిబ్బయైపోయెను. నాగశర్మకు మతిలేక యేమియుఁ దోఁచక, నిరంతరము నామెనే యెదఁదలఁచుకొనుచుండెను. కొంతకాలము గడచిపోయెను. ఒకనాఁ డతఁడు స్నానముఁ జేయుచుండ నతని చేతి వ్రేలినున్న యంగుళీయము జారి నదిలోఁ బడిపోయెను. ఆ యుంగరము నొక చేప మ్రింగెను. ఆ మత్స్య మొకజాలరివాని వలలోఁ జిక్కెను. అతఁడు నిత్యము రాజుగారి యంతఃపురమున మత్స్యముల నిచ్చుచుండును. ఆ నాఁడిచ్చిన మత్స్యములఁ దఱుగుచుండగా నీ యుంగరము కన్పించెను. మహాద్భుతముగ మిలమిల మెరయుచున్న యా యుంగుళీయమును రాజకొమరిత ధరించెను. వెంటనే యామె క్షుత్పిపాసలు అంతరించినవి. అందఱును రాకుమారికి జబ్బుచేసినదని భావించిరి. ఘన వైద్యు లెందఱో పిలిపించబడిరి. అందఱును యామె వ్యాధిని కనిపెట్ట లేకపోయిరి. క్షుత్పిపాసాపీడితుఁడై, రాజుగారి భవనమునకు యాచనార్థమై చనిన నాగశర్మ కీసమాచారమెల్ల తెలిసెను. అతఁడు "నేనామెకు రోగనివృత్తిఁ జేయుదు" ననియెను. ఆమెను వారు నాగశర్మకు జూపిరి. వారి నందఱను వెడలిపొమ్మని, యామె వ్రేలిని తనకు రంభ యిచ్చిన యుంగరమును జూచెను. చేప మ్రింగి, రాజుగారి కాయంగుళీయము దొరకెనని యాతఁ డంతకుమున్నే వినియుండెను. ఆమె యుంగరమువంటిదే చేయించవలెనని యెంచి "రాజా! వనమూలికలఁ గొన్నిఁటిని సేకరించవలయును, కొంతధనమి"మ్మని యడిగి, యాపైక

ముం గొనిపోయి యొక యుంగిరమును జేయించి, తెచ్చి తన యుంగరమునుదీసి, యీ యుంగరము ధరింపఁజేసెను. ఆ యుంగరమును తొలగించినక్షణముననే రాజకుమారికి క్షుత్పిపాస లారంభమైనవి. రాజుపొందిన యానందమునకు మేరలేకపోయెను. అతఁడు నాగశర్మకు ధనము బహుళముగా నొసంగి యింకేమైనఁ గావలయునా? యని యడిగెను.

"మహారాజా! నాకు వేరేమియు వలదు. మన నగరమునకు వెలుపల తూర్పుదిశను సముద్రముచెంత నొకదిబ్బ యున్నది. ఆ దిబ్బ త్రవ్వించి, యా సముద్రజలమట ప్రవహింపఁ జేయుటవలన నేఁ దలపెట్టిన యొక మహాత్కార్యము సాధింప గలుగుదును." అని, యావిప్రనందనుఁడు చెప్పినంతనే, రాజు స్వయముగా దగ్గరనేయుండి నూరు పనివారలచే నొక్కగంటలో నా దిబ్బ త్రవ్వించుసరికి, సముద్రము ప్రవహించెను. రంభకు శాపవిముక్తియై, లేచి వచ్చి నాగశర్మ నాలింగన మొనరించుకొని మఱలఁ దరువాత వత్తునని వచించి, యమరలోకమునకుఁ బోయెను. విస్మయపరీతచేతస్కుఁడైన రాజు తన తనూభవను నాగశర్మ కిచ్చి, పెండ్లిచేసెను."

ఈ రీతిగా కథ ముగించినపిదప మనోరమ కుంజరముపైనున్న హౌదాలో దాను కూర్చుండి, యతనిని వెనువెంటనే రమ్మనెను. మనోరమ యంతఃపురమునకుఁ బోయి తలిదండ్రులతోఁ దాను ప్రేమించిన రాజకుమారుఁడు వచ్చెనని చూపించెను. తండ్రి వచ్చి యతఁడు పుళిందనగరాధినాథుని తనూభవుఁడని యెఱింగి, యతని జనకునకుఁ గబురంపి శుభదినంబున వివాహము మహావైభవమున జేసెను. మనోరమా ప్రచండవర్మలు హాయిగ జీవింపనాగిరి.

కథను చిలుక ముగించెను. పద్మిని "అక్కా! ఎంత బాగున్న దమ్మా యీ కథ నాకు నిద్ర కూరుకుని వచ్చుచున్న" దని వాక్రుచ్చి, హాయిగ నిదురించెను.

# 25 రూపరేఖకథ.

———:o:———

ఆనాఁటిరాత్రి మంజరివచ్చి "ఏమమ్మా! పద్మినీ! రాజు నీకొఱకై కామవికారమునకు లోనై యెంతో బాధపడుచుండగా, నీ విసుమంతయైన లక్ష్యములేక యివ్విధమునఁ జేయుట పాడియగునా? రమ్మా." అనగా యామె మేలైన జరీచీర ధరించి, సకలాభరణవిభూషితయై బయలుదేఱ, చిలుక "అక్కా! పద్మినీ నా నిజవృత్తాంతము నీ నాఁడు చెప్పదలఁచితిని. నా జీవితములోని యొక సంతోషకరమైన సంఘటనమునుకూడ తెలుపఁదలఁచితిని. మీ యిరువురునుకూడ విని తీరవలసినకథ" యని యీ విధముగాఁ జెప్పసాగెను.

"నేను చిలుకనై మాట్లాడుట మీకు వింతగొలుపవచ్చును. ఏ మాట నేర్పిన నదిపలుకు చిలుకలేగాని యివ్విధంబునఁ బ్రసంగించు చిలుకలను మీరు చూచియుండరు. ఉజ్జయిని మహాకాళినగరము నేలుచుండెడి విక్రమార్క సార్వభౌముని పేరు వినియుంటిరా? ఆ విక్రమార్కుఁడను నేను. కాని నేనీ విధముగా చిలుకగా మారుటకుగల కారణము మీ రెఱుంగఁజాలరు. నేను రాజ్యముఁ జేయుచుండఁగా భట్టి మంత్రియై సహాయపడుచుండెను. ఒకనాఁడు మా నగరమున

కొకసాధువు వచ్చి, పరకాయప్రవేశవిద్య నెఱిగింతు నా యాత్రమును నకు రమ్మని చెప్పెను. ఎన్నాళ్ళు నేర్చుకోవలయునని యడుగ నయిదారుదినములున్నఁ జాలును అని యా సిద్ధుఁడు చెప్పెను.

రాజ్యపాలనకాల మాఱుమాసములును ముగిసి, భూసంచారము చేయు తరుణ మాసన్నమగుటచే, రాజ్యభారమును భట్టికి వప్పఁజెప్పి నేను బయలుదేరితిని. ఈ సిద్ధుని సమాచార మెట్లు తెలిసినదోగాని యొక కంసాలియు నన్ననుసరించి "సార్వభౌమా! నాకు చిరకాలము నుండియుఁ బరకాయప్రవేశము నెఱుంగవలెననియున్నది. నన్నుకూడ మీతో రానిండు." అని బ్రతిమాలెను. పోనిమ్మని నే నూరకొంటిని. సిద్ధుఁడు నా కుపదేశముఁ జేయుచుండగా నతఁడు వెలుపల పొంచి యుండి వినెను. నే నీవలకువచ్చి, యటనుండి బయలుదేఱితిని— "ప్రభూ! మిమ్ము కొంతకాల మనుసరించి, వలయుఁ బరిచర్య నొనరించి కృత కృత్యుఁడ నయ్యెద" ననెను. నే నట్లు పయనమొనరించి విష్ణువర్ధన పురంబును జేరితిని. ఒక పూటకూటియింట బసచేసి "అవ్వా! ఈ పుర విశేషము లేవి?" మని యడుగ నామె "అయ్యా! వినుము. మా పురాధిపతి కనకాంబరమహారాజునకు రూపలేఖయను కొమరితకలదు. ఆమె చక్కనిచుక్క. ఆమె యొక చిత్రమైన ప్రతమును బూనియున్నది. తన్ను వివాహమాడదలఁచినవారు ఒకమాఱు మాట్లాడించవలెను. లేదేని సంవత్సరము కారాగృహవాసశిక్ష ననుభవించవలయును. అనేక దేశములనుండి, నిత్యము రాకుమారు లెందరోవచ్చియు, యా సుందరాంగిని మాట్లాడించలేక, కారాగృహము పాలైనారు" అని చెప్పెను. నేను రాజాంతఃపురమున కరిగితిని. రాజు నన్ను చూచి గౌరవించి "ఆర్యా! మీ తేజోవంతమైన రూపముచూడ మీ రెవరో దేశాధీశు లని తోఁచుచున్నది. ఇంతవఱకు యెందరో రాకుమారులువచ్చి, విఫ

లులై కారాగృహవాస మనుభవించుచున్నారు. నా కుమార్తె తెలివి హీనమైన వ్రతము దాల్చియున్నది. మీ బోటివారిని పెండ్లి చేసికొని యున్న నెంత బాగుండెడి" దనెను.

"అయినను ప్రయత్నించి చూచెదను. లేదా, యిప్పుడు ఖైదు ననుభవించుచున్నవారికి నే నొకఁడను తోడయ్యెద" నంటిని. ఆనాఁటి సాయంకాలము నేను రాజకొమరితను జూచుటకై వెడలితిని. మనోజ్ఞమైన ఆమె యాగారమునకుఁ బోయినంతనే పరిచారిక యొకర్తుక యెదురుగావచ్చి లోనికి దోడ్కొనిపోయెను.

"ఆర్యా! అదిగో! ఆ శయ్యపై తలవైపు కనిపెట్టి కూర్చుండవలయును. ఆ పిదప మా రాజపుత్రి రూపలేఖను ఒకసారి మాట్లాడించవలయును. మాట్లాడించగలిగితిరా, కృతకృత్యులై యామెను భార్యగాఁ బడయుదురు. లేదా కారాగృహమున నుందురు" అని యా పరిచారిక పలుక, మందహాస మొనరించి, నాకు నిరంతరము వశుఁడై యుండు భేతాళుని మనంబునఁ దలంచుకొని జేబులోని నిమ్మకాయను దీసి శయ్యపై వైచితిని. అది పాదములుండెడి దెశకు దొర్లిపోయెను. అప్పుడు నేను తలవైపున గూర్చుంటిని. పరిచారికలు ఒక తెరకట్టి, రాకొమరిత రూపలేఖను గొనివచ్చి కూర్చుండబెట్టి, వెడలిపోయిరి. నే నప్పుడు కొంతసే పూరకుని రహస్యముగా భేతాళునితో "నేను నిన్ను కథలను జెప్పుమందును. ఈ యాగారములోని వస్తువులలో నావేశించి, విచిత్రములైన కథలఁ జెప్పుమా!" యని యడిగితిని.

నే నపుడు "ఆహా! నాకు నిద్ర జనించుటలేదు. రాకుమారికి నాకు మధ్యనున్న యో తెరా! నీవైన యొకకథ చెప్పవే?" యని యడుగ భేతాళుఁడా తెర నావహించి "ఆర్యా! నన్ను రెండువైపుల బిగించి కట్టినందున నా కూపిరాడుటలేదు. నే నెట్లు చెప్పుదు?" ననగా "ఇదియేమి? ఎచ్చటను చూడనివిచిత్రము? తెర మాట్లాడుచున్నదే?" యని రూపలేఖ యాశ్చర్యచకితయై యా తెర నుతొలఁగించినది. అనన్యసామాన్యమైన యామె సౌందర్యమునుగాంచి

విభ్రాంతుఁడనైతిని. ఆమె నన్ను చూచియు, నానందవికసిత వదనారవిందయగుట గాంచినంతనే, నా డెందము మమందానందమునకు లోనైనది. "ఓ తెరా! ఇపుడేమియు విరోధము లేదుగదా! చెప్పు" మంటిని. భేతాళుఁ డిట్లు చెప్పసాగెను.

"ఒక యూరిలో నలువురు స్నేహితులుండిరి. ఒకఁడు బ్రాహ్మణుఁడు, ఒకఁడు సాలె, మరొకడు విశ్వకర్మ, ఇంకొకఁడు వడ్లాబత్తుఁడు. ఈ నలువురు నొకసారి గ్రామాంతరమునకుఁ బోయివచ్చుటకై బయలుదేఱి, సాయంకాలమగుసరి కొక యరణ్యమును జేరిరి. పదిగంటలగునంతవఱకు సంభాషించుకొనుచు, నిదురవచ్చుటచే నొక్కొకఁ డొకఝాము మేల్కాంచి, క్రూరమృగ భయములేకుండ కాపాడుచుండుటకై నిశ్చయించుకొనిరి. వడ్లాబత్తుఁడు ముందుమేల్కొని యుండెను. అతఁడు తన దగ్గరనున్న కొయ్యపలకను జక్కగాచెక్కి మానవాకృతి నేర్పరచెను. పదునారేండ్ల యువతిప్రతిమ తయారుచేయఁబడెను. తన వంతు వ్యవధియైపోయినపిదప వడ్లాబత్తుఁడు నిదురించెను. విశ్వకర్మ మేల్కొనెను. అతఁడు సర్వాభరణములను తయారుచేసి, యలంకరించెను. అతఁడు నిద్రించినపిమ్మట సాలె లేచి, యా ప్రతిమ ధరించుట కొక యందమైన చీరనునేసి, ధరింపజేసి నిదురించెను. నాల్గవఝాము రాగానే బ్రాహ్మణుఁడు లేచి, యా ప్రతిమ యందమున కబ్బురమంది తన మంత్రశక్తిచేఁ బ్రాణము వోసెను. ప్రతిమ సజీవయయ్యెను.

"ఈమెను నేను వివాహము చేసికొందునని బ్రాహ్మణయువకుఁడు. ప్రతిమను జెక్కినది నేను కావున నాకే యీమె భార్యయగు" నని వడ్లాబత్తుఁడును—యిదేవిధమున నలువురును నామెకై కలహింపసాగిరి. కాని వారి కలహమునకుఁ దగినట్లులే యా ప్రతిమ కొంతసేపటికే, మంత్రశక్తి యంతరించి, ప్రాణములఁబాసెను. నలువురు నేడ్చుచు నా ప్రతిమకు దహనక్రియ లాచరించి, యా భస్మమును బంచుకొని నాల్గుత్రోవల ననుసరించి, చనిరి.

బ్రాహ్మణుఁడు తిరిగితిరిగి యొక యగ్రహారము చేరెను. ఒక భూసురుఁ డాతని నతిథిగారమ్మని భోజనమున కాహ్వానించెను. ఇతఁడు నదికేగి, సుస్నాతుఁడై యా విప్రగృహంబునకుఁ జనుసరి కాయిల్లాలు వంటచేయుచుండెను. ఆమె తనయుఁడు పసిబాలుఁ డేడ్చుచుండుటచే నామె చీకాకునొంది "ఛీ! దిక్కుమాలిన సంతానము!" అని కోపావేశమున నా పసిబాలుని మండుచున్న యా ప్రొయ్యిలోఁ బడవైచెను. అది చూచి అతిథిగావెళ్ళిన బ్రాహ్మణయువకుఁడు విస్మయపరీతచేతస్కుఁడై "ఛీ! అది యేమిపని? పిల్లవాడు యేడ్చినంతమాత్రమున నగ్నిలోఁ బడవైతురా? ఇట్టి హత్యాపాతకుల గృహమున భోజనము సేయరాదు. వెడలిపోయెద" నని లేచునంతలో, నా గృహయజమాని వచ్చి, జరిగినదెల్ల దెలిసికొని, "ఆర్యా! మీరు వెడలిపోనక్కరలేదు. ఆమె యీ విధముగా దినమున కొకసారియైనఁ జేయుచునే యుండును. ఇప్పుడే యా బాలుని బ్రతికింతును. చూడుఁ" డని పలికి, లోనికేగి యొక తాళపత్రగ్రంథమును గొనివచ్చి యా భస్మముపై నుంచుసరికి శిశువు సజీవుడాయెను. అది చూచి భూసూరనందనుఁడు తాను ప్రాణముపోసి, గోల్పోయిన సుందరాంగిని బ్రతికించుకొననెంచి, యారాత్రి యందఱు నిద్రించుచుండఁగా, నా తాళపత్రగ్రంథమును సంగ్రహించి వెడలిపోయెను.

అతఁడు తిన్నగా నరణ్యములోనికిఁ బోయెను. అప్పటికే యాతని మిత్రులు కంసాలి, సాలె, వడ్లాబత్తులు ముగ్గురును దిరిగి వచ్చుచునచ్చటికే వచ్చిరి. ఆ భస్మముపై భూసురకుమారుఁడు తాళపత్రగ్రంథము నుంచుసరి కా ప్రతిమ లేచి కూర్చుండెను. అపుడు నా భార్య నా భార్యయని నలువురును కలహింపసాగిరి. "ఓ విక్రమార్కసార్వభౌమా! ఆమె యెవరిభార్య యగునో చెప్పుమా?" యని తెర ప్రశ్నింప, విక్రమార్కుఁడు ఆ రాకుమారిచే నెట్లయిన మాట్లాడింపఁదలంచియుండుటచే "ఆమెకు బట్టనేసియిచ్చిన సాలెకు భార్య యగు" నంటిని—

రూపలేఖ వెంటనే బ్రాహ్మణుఁడే జీవమిచ్చుటచే నామె యతని భార్యయే” యనెను—

“ఓహో! అటులనేగాని మాట్లాడితినిగదా! వ్రతభంగమైన” దని పలికితిని. రూపలేఖవచ్చి, నా శయ్యపై గూర్చుండి “మీ పేరు వినినంతనే నా హృదయ మానందతరంగమాలికలఁ దేలిన” దనెను.

ఇరువురము నా రేయి సరససల్లాపమగ్నులమై గడపితిమి. కనకాంబరమహారాజుఁ దనూభవకు వ్రతభంగమైనదని యెఱింగి మాకు వివాహ మొనరించెను. కొలఁదిమాసములుండి, నేను మఱల యుజ్జయినికి బయలుదేఱి, నగరమును సమీపించునరికి చీఁకటిపడుటచే, భట్టికి గబురంపితిని. పరిచారకులువచ్చి గుడారముల నేర్పఱచి, మఱుచటి యుదయమున పాలకీని గొనివత్తుమని చెప్పి వెడలిపోయిరి.

ఆ రాత్రి వెన్నెల మనోహరముగఁ గాయుచుండెను. ఉన్నత మహీరుహముల యాకులు వాయుప్రసారమున కిటునటు కదలుచుండెను. చల్లనిగాలి వీచి హృదయమున కాహ్లాద మొసఁగూర్చుచుండెను. నేనును రూపలేఖయు గుడారమున కీవలఁ గూర్చుంటిమి. ఆ వృక్షముపై రెండుచిలుకలు కిలకిలమను శబ్దము చేయుచున్నవి. ఇంతలో నొక గ్రద్ద మగచిలుకను తన్నుకొని పైకి యెగిరెను. క్షణములో నా చిలుక మా పాదములచెంతఁ బడెను. దానినెత్తి చూచునరికే యది విగతప్రాణమై యుండెను.

ఆడుచిలుక బిట్టుగ వగచుచుండెను. నాకు జాలికలిగి, దుఃఖసంద్రమున మునిఁగియున్న యా చిలుక కొకింత యూఱటఁ కలిగింప నెంచి, నేను గుడారములో నా శరీరమును భద్రపఱచి, యా చిలుక కళేబరమునఁ బ్రవేశించి, పైకి యెగిరితిని. మరొక గుడారముననున్న విశ్వకర్మ యిది గమనించి, తటాలున నా శరీరమున బ్రవేశించి, తన కళేబరము నొకచో ఖనన మొనరించెను.

అతడు నా సతి రూపలేఖను సమీపించి ఏవేవో యసందర్భముగఁ బలుకనారంభించెను. నా ప్రవర్తనకు నా మాటకు—నడవడికి—

యతని ప్రవర్తనమునకు నసాధారణమైన భేదము కాన్పించుటచే, రూపలేఖ సంశయాత్మయై "నే నొక వ్రతమును బూనియున్నాను. అది తీరునంతవరకు నన్ను నీవు స్పృశింపరా" దని చెప్పెను. మఱుచటియుద యమున భట్టి వచ్చెను. ఆమెవలన జరిగినదంతయుఁ దెలిసికొనెను. నేనును కంసాలిని వెంటరానిచ్చినందులకు తగిన యపకృతిజరిగెనే యనియు, భట్టిమాట విననైతినేయనియుఁ బశ్చాత్తాపపడి కర్తవ్య మును భట్టి చెవిలోఁ జెప్పితిని. అతఁడు రూపలేఖను గొంపోయెను. కంసాలి యానందమునకై నలువురు పరిచారికలు నియోగింపఁబడిరి. నేను కాంతారములోనికిఁబోయి యొక మహీజముపై నున్న చిలుకలదం డును కలిసికొని మెలఁగసాగితిని. ఒకనాఁ డొక వ్యాధుఁ డామహీజము కడకువచ్చి చూచిన సమాచారమును నేను గమనించి, మిగిలిన చిలుక లతోఁజెప్పి, యా వృక్షమును విడిచిపోవుదమని చెప్పినను, ఆ కీరములు వినక యుపేక్షవహించినవి.

కిరాతుఁడు మఱునాఁడువచ్చి, వలఁబన్ని వెడలిపోయెను. నేనుచెప్పి నమాట వినకపోయినందులకు, ఆ శుకములన్నియుఁ జింతించి కర్తవ్య మేమని యడిగినవి. వలలోఁ జిక్కుకొనియున్న నేనా చిలుకల నుద్దే శించి "బోయవాఁడు వచ్చుసరికి మనమందఱము, తలలు వ్రేలవైచు కొని, చచ్చినట్లు పడియుందము. అతఁడు మనలను వలనుండి యావలఁ బడవేయునపుడగు శబ్దమునుబట్టి లెక్కిడుకొనుచు నూఱుపూర్తికాగానే జివ్వున నెగిరిపోవుద" మంటిని. అతఁడు వచ్చి, "మృతినొందియున్న యీ చిలుకలు నా కేల" నని గరవాటు వేయసాగెను. 99 చిలుకల నావలఁ బడవైచినపిదప, నతని నడుమునకున్న కత్తిజారి క్రిందఁబడినది. నూఱు లెక్కపూర్తియయ్యెనని తలంచి యా కీరము లొక్కసారిగా జివ్వున నెగిరిపోయినవి. కిరాతుఁడు విస్మితుఁడై "తుదకు చిలుకలచే మోసగింపఁబడితినే?" యని, మిగిలియున్న నన్నుజూచి, క్రోధోన్మ త్తుఁడై కంఠము నులిమి, చంపఁబోయెను. నేను మానవకంఠస్వరమున "ఓయీ! తొందరపడకుము. నన్ను జంపిన నీకు వచ్చునదేమి? నన్నె వరికైన విక్రయింపు" మంటిని.

అతఁడు నగరములోనికిఁ దీసికొనిరాగా నీభర్త రత్నాకరుఁడు కొనినా" డని ముగించితిని. పద్మినియు, మంజరియుఁ గూడ గాఢనిద్రావివశలైరి.

## 26 ఉపసంహారము.

:o:

మఱునాఁటి యుదయమున రత్నాకరుఁడును, అతనితోఁగూడ మఱొకఁడును వచ్చిరి. రత్నాకరునితో చిలుక, మన్మథసింహుని దురూహను, తాను కథలఁజెప్పి, యామె శీలమునకు భంగము కలుగకుండ కాపాడితిననియుఁ జెప్పెను. రత్నాకరుఁడు "మహానుభావా! ఈగూఢచారివలన సర్వము నెఱింగితిని, జగజ్జేగీయమాన యశోవిశాలులైన విక్రమార్కసార్వభౌము లివ్విధమున నుండుట కాలమహిమ గాకేమున్న?" దనెను.

అనేకవిధముల వినుతింపఁబడి యా చిలుకరూపముననున్న విక్రమార్కుఁడు భట్టి తనకై కబురంపినాఁడని విని, వర్తకుని సెలవుగొని పద్మినితోఁజెప్పి యుజ్జయినికి నెడలెను. కంసాలి రాణులను వశపరచుకొనుటకై యనుదినము ప్రయత్నించుచుండెను. రాజురాక నెఱిఁగించి కంసాలిని వంచించుటకై యీ విధముగాఁ జేయవలయునని యొకవిధానము నెఱిఁగించెను. మఱునాఁడు అంతఃపురములో రాణులు గొల్లుమనిరి. దానికి కారణమేమని కంసాలి యడిగెను. మహారాణుల చిలుక చనిపోయినదని పరిచారకలు చెప్పగా, పరకాయప్రవేశము నేర్చినవాడగుటచే, ఆ చనిపోయిన చిలుక శరీరమునఁ బ్రవేశించెను. కంసాలి శరీరమున విక్రమార్కుఁడు ప్రవేశించెను. కంసాలి జరిగిన మోసమును గుర్తించెను. భట్టి యా చిలుకనుబట్టి చంపించెను.

విక్రమార్కుఁడు నిజసతీమణులంగూడి ప్రజానురంజకముగ రాజ్యపాలనము సేయఁగడంగెను.

సంపూర్ణము.